# [illegible]

కప్పగంతుల మల్లికార్జునరావు

'విజయ' అనుబంధ. మాలికలో
వెలువడ్డ ఆరవ నవల

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

విజయ అనుబంధం
'VIJAYA' SUPPLIMENT No: 6
JUNE 1976

# 'POGA MEDALU'

BY KAPPAGANTULA MALLIKARJUNA RAO



వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
8, ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

# వ్యసనం

కప్పగంతుల మల్లికార్జునరావు

రాజమండ్రి స్టేషనులో రైలు దిగి ఏ రిక్షా అతనైనా సరే 'ఓంనమశ్శివాయగారిల్లు తెల్సా!' అని అడగండి. 'ఓ- ఆ ప్లీడరు బాబుగారిల్లు తెలీనివాడున్నాడా? ఎక్కండెక్కండి' అని తొందరపెట్టేస్తాడు. బాడుగ బేరమాడ బోయారనుకోండి 'ముందెక్కండి బాబూ! ప్లీడరు బాబుగారింటికెళ్తున్న వాళ్ళతో బేరంలేదు' అని ఎత్తి రిక్షాలో కూర్చోబెట్టుకు తీసుకుపోతాడు.

ఏ షాపులోనన్నా ఓంనమశ్శివాయగారిని గురించి వాకబు చేయండి. "ధర్మరాజుగారు, వారిని తెలీని పిచ్చిమాలోకాలెవరండీ, పదండివెళ్దాం" అంటూ యింటిదాకా తీసుకొచ్చి వదిలివెళ్తారు.

అలనాటి ఆ ధర్మరాజు జూదమన్న వొక్క వ్యసనంవల్ల రాజ్యాన్ని, భార్యను, తమ్ముళ్ళను వోడిపోయి, అడవులపాలయి అష్ట కష్టాలు పడ్డాడంటారు. కాని యీ ధర్మరాజు బిరుదు బడసిన ఓంనమశ్శివాయకున్న వ్యసనాలకు లెక్కలేదు.

ఆయనకి క్లబ్బులో పేకాడి కాస్తో కూస్తోఅన్నా నష్టపోతేగాని ఆ రాత్రి నిద్రపట్టదు. కాఫీహోటలుకు వొంటరిగా వెళ్ళినా, బిల్లు

మరొకడిస్తాడన్నా మనసు జివజివలాడి పోతుంది. అతిధులు నలుగు రైదుగురన్నా లేకుండా భోజనం చేయలేడు. చేసినా ముద్ద మింగుడు పడదు. యిలాంటి మరెన్నో ఖరీదైన వ్యసనాలన్నిటికీ మూల వ్యసనం వొక్కటే. ఆయనకి తన్నంతా ధర్మరాజు, కలియుగ కర్ణుడు అభినవ శిబి అని అనుకోవాలని, ఆ బిరుదులతో తన్నంతా పొగడాలన్న తీవ్రమైన వుబలాటం వుంది. ఆ వుబలాటం ఒక రోజుతో, సంవత్స రాలతో తీరేది కాదు. పొగిడేకొద్దీ మరీ పొగిడించుకోవాలన్న దుగ్ధ పెరిగింది. దానితోపాటు ఖర్చు పెరిగింది.

అంచేత వూళ్ళో ఏ ప్రజాహిత కార్యక్రమం తలపెట్టినా దాతలు లిస్టులో ప్రథమ నామధేయం ఓంనమశ్శివాయదే. అటు రాజకీయ సంస్థలనుంచి యిటు నాటక, నృత్య, చిత్ర, సాహిత్య సంస్కృతీ సంస్థలదాకా ఆయనకు సంబంధంలేని సంస్థ లేదు.

యీ కీర్తికండూతి అనేది చాలా ఖరీదైన వ్యసనమని నమశ్శివాయకి తెలీదా అంటే చెప్పటం కష్టం. యీ వ్యసనం ఆయనకి యీవాళ వొచ్చిందికాదు. చాలా చిన్నప్పుడే పట్టువడింది. అరవయ్యో పడిలోపడ్డా యింకా సాగుతోంది.

అది ఆయన ప్రతిభ కాదు. అందుకు నిదర్శనం ఆయనకున్న "చెట్టుకింద ప్లీడరు" అన్న బిరుదు. ప్లీడరీద్వారా ఆయన ధనార్జన చేయలేదు. ఆ వృత్తి కీర్తికండూతి తీర్చటానికి మరో సాధనం అయింది.

యివన్నీ వ్యక్తిగా నమశ్శివాయకు సంబంధించిన అంశాలు. యిక ఆయన కుటుంబాన్ని, అందులో ఆయన స్థానాన్ని చూద్దాం.

ఆయన యిల్లు వొక మ్యూజియం లాంటిది. కుటుంబంలోని సభ్యులంతా రకరకాల బొమ్మల్లాంటి వాళ్ళు.

నమశ్శివాయ మంచి మూడ్‌లో వుండగా "మీ కెందరు పిల్లలు? వాళ్ళ పేర్లు వరుసగా చెప్పండి" అని అకస్మాత్తుగా అడిగేరమ కోండి. అది ఆయనకు పరీక్ష. ఆ పరీక్షలో దారుణంగా ఫెయిల్ అవుతా నని వొప్పేసుకొంటాడు గాని, పాసవుదామన్న ప్రయత్నం ఆయన ఎప్పుడూ చేయలేదు. తన పిల్లల పుట్టుకకు తను నిమిత్తమాత్రుడ నేనని ఎప్పుడూ ఆయన వుద్ఘోషిస్తూనే వుంటారు. వాళ్ళు వృద్ధిలోకొచ్చినా,

చెడిపోయినా వాటివల్ల వచ్చే ఖ్యాతిని కాని, అపఖ్యాతిని కాని ఆయన ఎన్నడూ ఆశించలేదు. పిల్లల విషయంలో ఆయన్ని కర్మసన్యాసిగా చెప్పుకోవచ్చు.

ఆయన భార్య కామాక్షమ్మ యీ విషయంలో భర్తనేమాత్రం తీసిపోదు.

జపాలు, తపాలు, పూజలు, పురాణాలు, భజనలు, వ్రతాలు సమారాధనలు- ఆమెకు రోజంతా పుణ్యం గంపల్తో సంపాదించు కోటానికే సరిపోదు. యిక పిల్లల్ని చూసుకొనే తీరికెక్కడ?

పుణ్యంకోసం కామాక్షమ్మ కాలాన్నేకాదు. కావల్సినంత డబ్బూ ఖర్చుపెట్టటానికి వెనుకాడదు. ఆ ఖర్చంతా తనకోసం కాదు. ఆ భగవంతుడి కోసమే అనుకొని ఆమె తృప్తిపడినా, ఆమెకూ మహా భక్తురాలని, ధర్మాత్మురాలని, పతివ్రత అనీ అనిపించుకోవాలన్న కండూతి లేకపోలేదు.

భర్త ఐహికమార్గంలో, భార్య ఆముష్మిక మార్గంలో మునిగి తేలుతున్నా పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయ్యారంటే అది మనుష్యుల గొప్పకాదు. డబ్బుగొప్ప.

డబ్బే పిల్లలందరికీ నామకరణం, అన్నప్రాసనల దగ్గర నుంచి కార్యాలు, కడుపు, సారెలుదాకా, అన్నీ జరిపించింది వైభవో పేతంగా.

"యిది లేదు" అని ఆ యింట్లో ఎవ్వరూ ఎప్పుడూ అనుకోలేదు. ఎవరు ఏది కావాలనుకొంటే అది బజారుకుపోయి కావల్సిన కొట్లో పద్దులోరాసి తెచ్చుకోటమే. నమశ్శివాయకు పద్దులేనికొట్టు ఆవూళ్ళో ఏదీలేదు. ఎవరూ ఆయన కుటుంబ సభ్యులకు ఏదీ కాదనరు. 'యింత బాకీ అయింది యివ్వండి' అని ఎవ్వరూ ఆయన్ని నిలెయ్యరు.ఆయన దగ్గర బాకీలు ఎలా రాబట్టుకోవాలో తెలిసిన కొట్టువాళ్ళు ఆ వూళ్ళో ఎవ్వరూ లేరు.

నిత్యోత్సవాలు, పక్షోత్సవాలు. మాసోత్సవాలు, సంవత్సరాలు రంగ రంగ వైభవంగా ఆ యింట్లో జరుగుతుంటే చూచే వోపికున్న వాళ్ళకి రెండుకళ్ళు చాలేవి కావు.అదంతా తన ప్రయోజకత్వమే అను

కున్నాడు నమశ్శివాయ. తన అదృష్టం, తనూ తన బిడ్డలు చేసుకొన్న పూర్వజన్మ సుకృతం అనుకొంది కామాక్షమ్మ.

నిజమే. అలాగే మరికొంత కాలం జరిగిపోతే మనమూ అలాగే అనుకొనేవాళ్ళం. అప్పుడీకథే వుండకపోను.కనీసం చిత్రప్రియ పెళ్ళి అయిపోయేదాకన్నా ఏ అంతరాయం లేకుండా ఆ కుటుంబ గమనం అలాగే సాగివున్నా బాగుండిపోయేది.

కాని అలా జరుగలేదు. అందుకే యీ కథ!

# 2

చిత్రప్రియ నమశ్శివాయ చివరికూతురు. పెళ్ళికి మిగిలిన వొక్కగా నొక్క ఆడపిల్ల. పెళ్ళి చేసేస్తే తల్లిగా తన బరువు తీరుతుందని, చిత్రప్రియ పెద్దమనిషి అయి ఏపుగా ఎదగటం మొదలుపెట్టిన దగ్గ ర్నుంచీ, ఎప్పుడూ అంటూనే వుంది కామాక్షమ్మ. చిత్రప్రియ కూడా వింటూనే వుంది.

కాని తలిదండ్రులు తన బరువేమీ మోయటం లేదని, వాళ్ళుగా వాళ్ళు దించుకొనేదీ లేదని ఆ పిల్లకు తెల్సు. అయిదుగురు అన్నలు, అయిదుగురు అక్కలు ఎలా పెళ్ళిళ్ళు చేసుకొని వెళ్ళిందీ ఆ పిల్ల చూచింది.

అందరికీ ఆ డబ్బే పెళ్ళిచేసింది. మగపిల్లలకి కట్నాల రూపంలో డబ్బు యిప్పించింది కూడా. ఆ డబ్బే అన్నలకి స్వతంత్ర జీవితాలని చూపింది. అందులో కొందరికి చదువు అంతంత మాత్రమే అయినా, అక్కల అందం అంతంత మాత్రమే అయినా బాగా చదువుకొన్న భర్తలు వచ్చారు. డబ్బున్న యిళ్లకు కోడళ్ళు అయ్యారు!

చిన్నపిల్లని, ఆఖరుపిల్లని తనను ప్రత్యేకంగా అల్లారు ముద్దుగా తలిదండ్రులు పెంచలేదని వూహతెల్సిన దగ్గర్నుంచి చిత్రప్రియకు కొరత.

చిత్రప్రియకు తను చాలా అందగత్తెనని గర్వం. నిజానికి ఆ పిల్ల చాలా అందగత్తె. వయసుతోపాటు ఆ అందంకూడా పెరుగుతూనే వుంది. కొత్త కొత్త కళలు సంతరించుకొంటూనే వుంది. కాని చిత్రప్రియకు వూహతెలిశాక ఆ అందాన్ని ఆ యింట్లో ఎవరూ గుర్తించినట్లుగాని, పొగిడినట్లుగాని గుర్తులేదు. అది ఆమెకు కోపం.

ఆమెకు తను తెలివిగల దానినన్న నమ్మకం వుంది. అది కేవలం ఆమె నమ్మకమేకాదు. నిజం. అందుకు నిదర్శనం ఆమె చిన్నప్పటి నుంచి ప్రతి క్లాసులో ఫస్టు మార్కులు తెచ్చుకోడమే. బి. యస్. సి. ఫైనల్ యియర్‌దాకా రావటమే.

ఆ మాటకొస్తే చిత్రప్రియ అక్కలెవరూ అంత చదువు చదవనే లేదు. మెట్రిక్ లోపలే చాలామంది చదువుకు మంగళహారతి పాడేసారు. అన్నలు మాత్రం? అత్తెసరు మార్కులతో పాసయ్యారు తప్ప ఎవరూ ఫస్టుమార్కులు తెచ్చుకోలేదు. యిద్దరు తప్ప ఎవరూ గ్రేడ్సు తెచ్చుకోలేదు. అయినా వాళ్ళకు పెద్ద వుద్యోగాలు వచ్చాయి అంటే అది వాళ్ళ ప్రతాపం కాదు. డబ్బు ప్రతాపం - వాళ్ళ మామల పలుకుబడుల ప్రభావం.

"మరికొన్ని నెలల్లో బియస్సీ ఫస్టు క్లాసులో పాసవుతానన్న ధైర్యం చిత్రప్రియకుంది. కాని ఆమె తెలివితేటల్ని ఎవరూ యింట్లో గుర్తించినట్లు కనబడదు.

యిన్ని ప్రత్యేకతలున్న తనని గుర్తించని తలిదండ్రులంటే ఆమెకు పెద్ద యిష్టమేం లేదు. కాగా కోపం. తండ్రికి డబ్బుండటం వల్లే తన ప్రత్యేకతలు గుర్తించటం లేదని ఆమె అభిప్రాయం. ఆ డబ్బుకాస్తా పోతే?— యీ ఆలోచన ఆమె కెన్నోసార్లు వచ్చింది. అందుకామె విచారించలేదు. కాగా ఆ ఆలోచన ఆమెకు సంతోషాన్నిచ్చింది.

తల్లి పూజలు, పునస్కారాల్లోపడి కన్నకూతురిలో ప్రతిభను గుర్తించటం లేదు. అంచేత తల్లి చేసే పూజలన్నా, ఆమె పూజించే దేవుళ్ళన్నా ఆమెకు గౌరవంకాని, భక్తికాని లేవు.

డబ్బు, అందం, హోదా వుంది. తన కులం కాని వాడిని, కులం తక్కువ వాడిని చూసి శాస్త్రోక్తంగా కాక, లేచిపోయి వాడిని రిజిస్టర్

మేరేజ్ చేసుకొంటే? అప్పుడు తల్లి ఏడుస్తుంది. లబోదిబో మొత్తు కొంటుంది. యిన్నాళ్ళూ పూజించిన దేవుళ్ళని తిట్టుకొంటుంది. బంగారంలాంటి పిల్లను చేజేతులారా దూరం చేసుకొన్నానే అని కుమిలిపోతుంది. అపుడు తన ప్రత్యేకత తెల్పివస్తుంది.... తల్లిని సాధించటానిగ్గాను వచ్చే యీ ఆలోచన ఆమెకు ఎప్పుడూ విపరీతమైన ఆనందాన్నిచ్చేది.

యిలా ఆలోచించే చిత్రప్రియ మనస్తత్వం ఎలాంటిదో తెల్పుకోటం కష్టంకాదు. ఆమెకు గర్వం జాస్తి. అహంకారం ఎక్కువ. తనలోని గుణాలని అందరూ గుర్తించాలనుకొంటుంది. గుర్తించకపోతే మనసులో మధనపడి కుముల్తుంది. ఆ వేడిలోనుంచి కక్ష పుట్టుకొస్తుంది. అ కక్షలో ఆమె అవతల వాళ్ళను ఎలాగోలా బాధపెడ్దామనుకొంటుంది. అందుకు తను బాధపడాల్సివచ్చినా పట్టించుకోదు.

యిలాంటి ఆలోచనల్లోవున్న చిత్రప్రియ అందానికి ఆ ఇంట్లో మొట్టమొదటిసారి గుర్తింపు లభించింది. కాని ఆ గుర్తించినవాళ్ళు తలిదండ్రులు కాదు.ఆమె చిన్నన్న సుధాకరం.

చదువుకూ సుధాకరానికి చిన్నప్పటినుంచి బద్ధవైరం. సుధాకరం చదువు నడవాలన్న మార్గంలో నడవలేదో, మరి చదువే అతను రావాలన్న మార్గంలో రాలేదో కాని, యిద్దరూ చెరోమార్గాన పయనించారు. మధ్య మధ్య యిద్దరూ కల్సుకొని కుస్తీపట్లు పట్టేవారు.

బి. ఏ. దాకా చదువునే జయిస్తూ వచ్చాడు సుధాకరం. కాని బి. ఏ లో చదువు అతన్ని చిత్తుగా వోడించింది. వదిలేసింది. తనే వదిలేశానంటాడు అతను.

చదువును చిన్నగా వదిలించేసుకొన్నాక. సుధాకరం తన జీవితధ్యేయంవైపు పూర్తిగా దృష్టిని కేంద్రీకరించాడు.

అతని ధ్యేయం ఎన్నడూ చదువుకొని వుద్యోగాలు చేయాలని, ఊళ్ళేలాలని కాదు.

బి. ఏ. తో కుస్తీ పట్టేనాటికే అతను ఎన్నో నాటకాలు వేసెడు. ఎన్నో పరిషత్తుల్లో ప్రదర్శనలిచ్చాడు. ఉత్తమనటుడి బహు

మతుల్ని పొందేడు. రంగస్థలం అతనికి చాల్లేదు. సినిమాలమీదికి అతని దృష్టి మళ్ళింది.

సినిమాల్లో నటించే నటుల్ని అతను నిజమైన నటులుగా మనసులో గుర్తించలేదు. వాళ్ళను స్టేజీమీద నాటకం వేయమంటే వేయలేరని అతని నమ్మకం. వేసినా ప్రేక్షకులు ఎంతోకాలం చూచి సహించరు.

అతనికి సినిమా నటుడంటే ఎలా నటించాలో నటించి తెలియ చెప్పాలనిపించింది. నటుడిగా స్థిరపడ్డాక నిజమైన సినిమా అంటే ఏమిటో హాలివుడ్ మోడల్‌లో ఓ చిత్రం తీసి చూపించాలని కోరిక పుట్టింది.

చదువును వదిలేశాక డబ్బు కొంత తీసుకొని మద్రాసువెళ్ళాడు. అన్ని స్టుడియోలు తిరిగేడు. అడ్డమైన వాళ్ళని ఆశ్రయించేడు. కాఫీలు టిఫెన్లు యిప్పించాడు. కార్లల్లో తిప్పేడు. తెచ్చిన డబ్బయితే అయిపోయిందికాని, వెళ్ళిన ఆశయం మాత్రం నెరవేరలేదు.

అతనిలో పట్టుదల పెరిగింది.

ఎవరో అతనిమీద దయతల్చి యిచ్చినట్లు ఓ వేషం ఇస్తామన్నారు. తీరా చూస్తే అది ఎక్స్ట్రా వేషం. అతని అభిమానం దెబ్బతింది. వెయ్యనన్నాడు. అతని కాకాస్త ఛాన్సు రాపటానికి ఎంతో ప్రయత్నించిన అతని మిత్రుడు బాధపడ్డాడు.

ఆ మిత్రుడి పేరు కృష్ణమూర్తి. రంగస్థలంమీద అతను ఒకప్పుడు మంచి పేరు తెచ్చుకొన్నవాడే. ఏదో ఆఫీసులో పర్మనెంటు గుమాస్తా ఉద్యోగం చేస్తుండేవాడు. యిలాగే సినిమా వ్యామోహంతో మద్రాసు వచ్చాడు. యిలాగే ప్రయత్నించగా ప్రయత్నించగా ఎక్స్ట్రా వేషం దొరికింది. వేసేడు.

అంతే. అయిదేళ్ళయింది. ఆ నాటికీ యీ నాటికీ ఎక్స్ట్రా వేషాలే.

సుధాకర్ ఎక్స్‌ట్రా వేషం వెయ్యనందుకు కృష్ణమూర్తి నవ్వేడు. చాలా ఎగతాళిగా నవ్వేడు. సుధాకర్‌లో పట్టుదల కసిగా మారేలా నవ్వేడు.

ఆ కక్షతోనే సుధాకర్ యింటికొచ్చాడు. ఆలోచించి ఆలోచించి సినిమా తియ్యాలన్న నిర్ణయానికొచ్చాడు.

కథనొకటి ఆలోచించాడు. ఆ ఆలోచించిన కథపై సినిమా ఆలోచన చెప్పకుండా వూళ్లోని కొందరు ప్రముఖ నాటక రచయితలతో చర్చించాడు. వాళ్ళ ఆలోచనలను తన బుర్రలో రాసుకొన్నాడు. కొందరు నటుల్తో అదే ధోరణిలో చర్చించాడు. కథ తయారు చేశాడు.

ఒకవైపు స్క్రిప్టు వర్కు చేస్తూ మరోవైపు నటీనటులను ఎంపిక చేయసాగేడు. హీరో ఎలాగూ అతనే. హీరోయిన్ వేషానికి ఓ లబ్ధ ప్రతిష్టురాలినే ఎంచుకొన్నాడు. మరో ప్రముఖ పాత్ర హీరో చెల్లెలు. ఆ పాత్రను కొత్తవాళ్ళ కివ్వాలనుకొన్నాడు.

అతని దృష్టి చిత్రప్రియమీద పడింది. స్వంత చెల్లెలుగాకాక ప్రొడ్యూసర్‌గా ఆ పిల్లను కెమెరా కోణాల్లోనుంచి పరిశీలించాడు. సినిమాలో తన చెల్లెలు పాత్రకు, అసలు చెల్లెలుకు కొన్ని పోలికలు కనిపించాయి.

సినిమాలో చెల్లెలుకూడా చిత్రప్రియలాగే గారాబంగా పెరిగింది. డబ్బుమీద నడిచింది. చిత్రప్రియకులాగానే ఎక్కడలేని అతిశయం వుంది. చిత్రప్రియచేత ఆ వేషం వేయించాలనుకొన్నాడు. నిజ జీవితంలో స్వంత అన్నాచెల్లెళ్ళు సినిమాలోనూ అన్నాచెల్లెళ్ళ వేషం వేయటం- ఏడెడ్ ఎట్రాక్షన్ కావచ్చు.

'చిత్రా, నేనెప్పుడూ గమనించలేదు కాని నువ్వు చాలా అందంగా వుంటావే–' అన్నాడోసారి సమయం చూచి.

యింట్లో వాళ్ళు తన అందాన్ని పొగడగా వినటం అదే మొదటిసారి.

"యిన్నాళ్ళకు నా అందాన్ని గుర్తించావన్నమాట! కొంపతీసి నాటకాల్లో వేషం వెయ్యమనటానికిక్కాదుకదా!"

"నాటకాలేం ఖాచ్చె. సినిమా ఛాన్సే వచ్చింది. సినిమా ఫీల్డులో నువ్వు దిగితే నటీమణులంతా మూటాముల్లెలు కట్టుకోవల్సిందే. నేను తీసే సినిమాలో వేషం యిస్తా. వేస్తావా?"

"నువ్వు సినిమా తీస్తావా? నాకు వేషం యిస్తావా? వంద్ర

పుల్" అంటూ తేలిగ్గా నవ్వి పారేసింది. ఆమెకు సుధాకర్ శక్తిమీద ఎప్పుడూ నమ్మకం లేదు.

"సీరియస్‌గా అడుగుతున్నా. తమాషా కాదు."

"ఏం వేషమేమిటి?"

"నా చెల్లెలు వేషం. అంటే హీరో...."

యీ తడవ చిత్రప్రియ విరగబడి నవ్వింది."సినిమాలో కూడా నీ చెల్లెలు వేషమేనా? అంటే నేను హీరోయిన్‌ని కాదన్నమాట?"

"కాదు, కాని నీది మంచివేషం"

"మిస్టర్ బ్రదర్, నేనంటూ సినిమాల్లో వేషాలువేస్తే చచ్చు పుచ్చు చెల్లెళ్ళ వేషాలు, అమ్మమ్మల వేషాలు, వేయను. హీరోయిన్. అదీ ఎలా? హీరో నాకు నచ్చాలి. అడ్డదిడ్డమైన బుడ్డిచెంబు మొహాల వాళ్లు హీరోలంటే వొప్పుకోను" ఆ ఆఖరిమాట అప్పుడే అటు వెళ్తున్న వో యువకుడివి చూస్తూ "బుడ్డిచెంబు"ను నొక్కి పెడ్తూ అంది.

ఆ యువకుడి పేరు వేదవ్యాస్, చిత్రప్రియ పెట్టినపేరు "బుడ్డిచెంబు"?

# 3

వేదవ్యాస్ చిత్రప్రియకు కొత్తవాడు కాదు. అతను చాలా చిన్నప్పటి నుంచి ఆ యింట్లోనే వుంటున్నాడు.

వ్యాస్ తండ్రిపేరు సూరిశాస్త్రి. నమశ్శివాయగారి యింటి పురోహితుడు కామాక్షమ్మకు, ఆమె భగవంతుడికి మధ్య మధ్యవర్తి. ఆమె వాంఛించే స్వర్గానికి సోపానాలు నిర్మిస్తున్నవాడు. అందుకే ఆమెకు ఆయనంటే గౌరవం. భక్తి. ఆదరణ.

సూరిశాస్త్రికి వేదవ్యాసశాస్త్రి రెండోవాడు. పుట్టగానే వాడి జాతకం చూచినవాళ్ళంతా మహారాజ యోగం వుందన్నారు.

అక్షరాభ్యాసంనుంచే వాడు చదువులో అఖండంగా వెలిగ

సాగేడు. వయసుతోపాటు తెలివి తేటలు వృద్ధి చెందటంకాదు వయసు కన్నా ముందే వృద్ధి చెందేయి.

వాడిని కొల్లాయి గుడ్డల్లో వూహించుకోవాలంటే భయమేసేది శాస్త్రికి. ట్వీడ్ సూట్లలో చిత్రించుకొనేవాడు.

కాని పెరిగే సంసారం, ఖర్చులు, పెరుగుతున్న ఆడపిల్లలు, వాళ్ళ పెళ్ళిళ్లు, కట్నాలు, కానుకలు, అల్లుళ్ళు, వియంకుళ్ళు, ఆయన కళ్ల ల్లో బ్రహ్మరాక్షసుల్లా కన్పించి జడిపించేవారు.

అయినా రానున్న తుఫానుకు భయపడి ఎక్కొచ్చే మొక్కను తుంచేయలేకపోయాడు.

కాని కొడుకు చదువు నిర్విఘ్నంగా సాగాలంటే తనమీద ఆధారపడి లాభంలేదు. తన ప్రమేయం లేకుండా వాడి కాళ్ళమీద వాడు నిలకాలి. ఎలా?

అన్నపూర్ణలా ఆయనకు కామాక్షమ్మ కన్పించింది. మూడు రోజులు వారం యిచ్చింది.

అదే సమయంలో సూరిశాస్త్రి ఆమెకు యింట్లో దేవతార్చన చేయించి, తీర్థం తీసుకొంటే వచ్చే ఫలితాలను నూరిపోసేడు.

సూరిశాస్త్రి వుపాయం పారింది. అంతా అనుకొన్నట్టే సాగింది.

కొడుకుని కామాక్షమ్మకు వొప్పచెప్పారు. వేదవ్యాస్‌కు వుపనయనం చేసి జంధ్యం పోగు వేసేడు. మంత్రం ముక్కలు వాడికి వంటబడ్తాయా అని సందేహించాడు సూరిశాస్త్రి.

కానీ చిత్రం!! యింగ్లీషు చదువుకన్నా వేగంగా వేదం వంటబట్టింది అతనికి.

పన్నెండేళ్ళ పసికుంక వేద మంత్రాలు స్వరయుక్తంగా చదువుతుంటే, కామాక్షమ్మకు — ఆ శివుడో, భవుడో, వాహన మూర్తో, వేదవ్యాసుడో తన ముందు మూర్తీభవించి కూర్చున్నట్లు, తనని తరింప చేయటానికి వచ్చినట్లు పొంగిపోయేది.

వేదవ్యాస్ ఆ యింట అడుగు పెట్టేనాటికి చిత్రరేఖ పు గొనులు తొడుగుతోంది. ముద్దు ముద్దు మాటలు మాట్లాడుతోంది. ఆ యీడు

లోనే ఆ పిల్లకు. కొల్లాయి గుడ్డ కట్టుకొని దేముడి దగ్గర కూర్చునే అతనంటే వో విధమైన చులకన భావం ఏర్పడింది.

ఆ పిల్లంటే అతనికి ముద్దు. వొకసారి ఆ పిల్ల ఏడుస్తుంటే ఎత్తుకోబోయాడు. విదిలించి కొట్టింది. మరోసారి దగ్గరకి తీసుకొన్నాడు. 'ఛీ పాడు' అంటూ కాళ్ళతో అతని మొహాన ఫెడేలున తన్నింది. కట్టుకున్న కొత్తగౌను విప్పేసి మరోటి తొడుక్కొంది.

చిత్రప్రియ గౌనులనుంచి వోణీలకు, చీరల్లోకి ప్రమోట్ అయింది. వయస్సు ఆ పిల్లలో తెస్తున్న మార్పులను అతను కనిపెట్టి తూనే వున్నాడు.

కాని ఆ పిల్ల అతనిలో వచ్చిన మార్పుల్ని గుర్తించలేదు. అతనూ పెద్దవాడయ్యాడు. పురుషలక్షణాలు పెరిగే కొద్దీ అతనిలో వర్చస్సు శోభిల్లసాగింది. ప్రతి క్లాసులో స్కాలరుకు వస్తే. అతనుచదివిన స్కూళ్ళకి పేరు వచ్చింది.

గవర్నమెంటు పిలిచి స్కాలర్ షిప్ లనిచ్చింది. ఫస్టుమార్కులు తెచ్చుకొన్నందుకు కాలేజీలో అతనికొచ్చిన బహుమతులకు లెక్కలేదు.

అయినా ఆ యింటిని, ఆ దేవతార్చన పీఠాన్ని అతను వదల లేదు. ఆ పీఠం ముందు అదే కొల్లాయిగుడ్డ. మొహాన అవే విభూది రేఖలు, కమ్మని కంఠంతో మంత్రపఠనాలు.

చిత్రప్రియ అతనికంటే ఆ యింటిలో కుక్కపిల్లకే ఎక్కువ విలువను, గౌరవాన్ని యిస్తుంది.

బియస్సీ స్టేటు ఫస్టుగా పాసయ్యాడు వేదవ్యాస్. పై చదువులకు మరో చోటుకి పోక తప్పదనుకున్నాడు.

కాని ఆ సంవత్సరం ఆ కాలేజీలోనే యమ్మెస్సీ కోర్సులు పెట్టేరు. అయినా అంతా అతన్ని యూనివర్సిటీకి వెళ్ళమన్నారు. లేకపోతే ఏ టెక్నికల్ ఇన్స్టిట్యూట్ కో వెళ్ళమన్నారు.

కాని అతనికి పాఠం చెప్పిన లెక్చరర్లు, కాలేజీప్రిన్సిపాల్ అక్కడే ఎమ్మెస్సీలో చేరమన్నారు. ఎక్కడ చదివినా మంచిమార్కులు తెచ్చుకోటం ప్రధానం అన్నారు. కాలేజీకి పేరుతీసుకురా అన్నారు.

వ్యాస్ ఎన్నో ఆలోచించి చివరకి ఆ కాలేజీలోనే యమ్మెస్సీలో

చేరాలని నిశ్చయించుకొన్నాడు. ఒకటి తన తలిదండ్రులకు ఆర్థికంగా సహాయ పడినట్లుంటుంది. రెండు నమశ్శివాయ గారి యింటిని దేవ పీఠాన్ని, అన్నపూర్ణమ్మ లాంటి కామాక్షమ్మగారిని వదిలిపోనక్కర్లేదు. మూడు తను అమితంగా యిష్టపడే హిస్టరీ మాష్టరు గారికి దగ్గరే వుండవచ్చు.

నాలుగో కారణం- విద్యాసాగర్. విద్యాసాగర్ వేదవ్యాస్ క్లాస్‌మేట్. వ్యాస్ తర్వాత ఆ కాలేజీలో అతనివే మంచిమార్కులు. యిద్దరి అభిరుచులు ఒక్కటే. ఆశయాలూ ఒక్కటే. మనస్తత్వాలు చాలావరకు కలుస్తాయి.

కాని సాగర్ ధనవంతుల బిడ్డ. ఆ గర్వం అతనికి లేదు. చాలా నిరాడంబరంగా వుంటాడు.

సాగర్‌ని చదువులకి పొరుగూళ్ళకి పంపటం అతని తండ్రికి యిష్టంలేదు. ఆయన వూళ్ళో పెద్ద వ్యాపారి. ఒక్కగా నొక్క కొడుకు సాగర్ ఆయనకు రెండో ప్రాణం.

వ్యాస్ బి. యస్సీ ఫైనల్‌లో వుండగానే చిత్రప్రియ బియస్సీలో చేరింది.

కాలేజీలో అందరి కళ్ళూ తనమీదే వుంటాయని ఆశపడింది చిత్రప్రియ. కానీ ఇందిర పోటీ అయింది.

నిజానికి ఇందిర చిత్రప్రియ కన్నా అందమైనదేం కాదు. ...గా పేదపిల్లేమో, చాలా నిరాడంబరంగా వుంటుంది. కలుపుగోలు ...నంగా వుంటుంది అందరితో. నిగర్వి. యీ గుణాలు ఆమె అందాన్ని ...ంచాయి. సహజత్వాన్ని తీసుకొచ్చాయి. అందుకే ఆమె అందరి కష్టానికు పాత్రురాలయింది.

చిత్రప్రియ అందం అగ్నిగోళం లాంటిది. సూర్య బింబం ...ంటిది. దూరంగా వుంటే వెలుగు. దగ్గరి కెళ్తే మంట. కాల్చి స్తుంది.

ఇందిర అందం చందమామ లాంటిది. వెన్నముద్ద లాంటిది. వెన్నెలలా వెలుగులు విరజిమ్ముతుంది. వెన్నముద్దలా ఆకర్షిస్తుంది.

అందుకే ఆ కాలేజీలో ఆడా మగాకి కూడా ఇందిర "కాలేజ్

బ్యూటీ" అయింది. ఆ ఇందిర కళ్ళెప్పుడూ వేదవ్యాస్ పైనే వుంటాయి.

డిగ్రీ క్లాసులో వున్నప్పుడే వేదవ్యాస్ కాలేజీలో అనవసర విషయాల్లో ఎన్నడూ జోక్యం కలుగచేసుకొని ఎరగడు. యమ్మెస్సీలో చేరాక మరీ పెద్దమనిషి తరహా వచ్చింది.

అయితే అతని ప్రభావం వుండని కార్యక్రమం ఎన్నడూ ఆ కాలేజీలో లేదు.

అతను పాడగలడు. కవిత్వం వ్రాయగలడు. అనర్గళంగా ఉపన్యసించగలడు. కానీ యీ ప్రజ్ఞలన్నీ ప్రదర్శించుకొంటే కాని తప్పదన్న దుగ్ధ లేదు. తన శక్తి తనకి తెల్సు. వాకరితో పోటీపడి నొప్పించే పద్ధతి కాదు.

అతన్ని కాలేజీలో శత్రువుగా పరిగణించిందీ, అసహ్యించిందీ చిత్రప్రియ వొక్కతే తన యింట్లో కొళ్ళాయి గుడ్డ కట్టుకొని గంట వాయించే గోచిపాత బ్రాహ్మణ కుర్రాడికి కాలేజి అంతా బ్రహ్మరథం పట్టటమా? ఆమె కడుపు మండింది. గుండెలు దహించుకుపోయాయి.

చిన్నప్పటినుంచి అతన్ని "కొళ్ళాయిగుడ్డ బుడ్డిచెంబు" గాడనే యితరుల దగ్గర వ్యవహరించేది. కాలేజీ కొచ్చాక అదక్లుప్తమై "కె. బి. చెంబు" గాడనటం సాగించింది.

చిత్రప్రియ బియస్సీ ఫైనల్ యియర్ లో కొచ్చింది. వేదవ్యాస్, విద్యాసాగర్ యమ్మెస్సీ ఫైనల్‌లో కొచ్చారు.

అప్పటికీ యింట్లో కాని. కాలేజీలో కాని చిత్రప్రియ ఆశించిన గుర్తింపు లభించలేదు. ఒంటరితనం ఆమెను వేధించింది. అటు తలిదండ్రుల్ని, యిటు వేదవ్యాస్‌ను, ఇందిరను తదితరులను సాధించా లన్న కక్ష పూర్తిరూపం దిద్దుకొంది ఆమెలో.

సాగర్ ఆమెకళ్ళల్లో పడ్డాడు. మనసులో నిల్చేడు.

అతన్ని జయిస్తే శత్రువులందర్నీ జయించినట్టే—

'హాయ్!' అంది వొంటిగా వెళ్తున్న సాగర్‌నుద్దేశించి వో రోజు. అది సాయంకాలం. గోదావరి బండ్ మీదకి షికారుకొచ్చాడు సాగర్. కుమారిలో సినిమాకని వెళ్తున్న చిత్రప్రియ కళ్ళబడ్డాడు.

"మిస్టర్ సాగర్, మిమ్మల్నే—"

అప్పుడతను వెనక్కి తిరిగేడు. "ఓ! మీరా!" అన్నాడు

ఆ గర్విష్టిపిల్ల తనని పలకరించటం! కారణం? ఏ మాట్లాడు తుందోనని నిశ్శబ్దంగా ఎదురు చూచాడు సాగర్.

పలకరించిందేకాని తీరా అతను ఎదురుగ్గా నిల్చున్నాక ఎలా మాట్లాడాలో తోచలేదు చిత్రప్రియకు. నిండు గర్భవతి నడుస్తున్నట్లు హుందాగా, బరువుగా ప్రవహిస్తున్న గోదావరి వైపు చూస్తూ నిల్చొంది.

"మీతో ఎన్నాళ్ళబట్టో మాట్లాడాలనుకుంటున్నాను. యిప్ప టికా అవకాశం చిక్కింది."

"అది నా అదృష్టం. ఏం మాట్లాడాలను కుంటున్నారో చెప్పండి"

"యిక్కడా?" ఆమె రోడ్డు ఆ చివర నుండి యీ చివరి దాకా వొక్కసారి దృష్టి సారించింది.

"అవన్నీ మామూలే. కాని అందం. ఆనందం. ఏకాంతం కావాలంటే రోడ్డుకు వీపునిచ్చి రోడ్డు మీద జరుగుతున్న వాటిని మర్చిపోవాలి. ఎదురుగా ఆ గోదావరిలోకి చూడండి. దూరంగా వెళు తున్న ఆ పడవల్ని చూడండి. ఆ నీటి పై ఎగురుతోన్న పక్షుల్ని చూడండి. గోదావరి అవతల వొడ్డున రెండు మైళ్ళ దూరాన చిన్న చిన్న పిచ్చికల గూళ్ళలా కన్పించే ఆ యిళ్ళను. వాటిమధ్యనుంచి ఫ్యాక్టరీ గొట్టంలోంచి పైకి అందంగా పోతున్న పొగను పరిశీలించండి. అప్పుడు చెప్పండి. రాజమండ్రిలో యింతకన్నా సుందర ప్రదేశం. ప్రశాంత స్థలం. ఏకాంత తీరం ఎక్కడ వుంటుందో"

"ఏమో ననుకొన్నా మీరు కవిత్వం చెప్తారే!-"

"నా మాటల్లో కవిత్వముందా? వుంటే అది నా గొప్పతనం కాదు. గోదావరి గొప్పతనం. గోదావరి అందాన్ని చూస్తూ తాదాత్మ్యం చెందిన వాళ్ళెవరికయినా కవిత్వం వస్తుందేమో మరి!"

"నేను కుమారిలో సినిమాకు బయల్దేరా. యిఫ్యు దోంట్ మైండ్ నాకు కంపెనీ యివ్వకూడదు పోనీ—"

పాత బ్రిడ్జి మీద గూడ్సు దడదడలాడుతూ పరుగెత్తుతోంది అప్పుడే.

అతను మాట్లాడలేదు. పొడవైన ఆ బ్రిడ్జిమీద జెర్రిపోతులా పాకి పోతున్న ఆ రైలువంక చూస్తూ విల్చున్నాడు.

"ఏమంటారు?"

"సారీ, నేను రాలేను. నాకసలు సినిమాలు చూచే అలవాటు అంతగా లేదు. అందునా యివాళ గోదావరి అందం అనుభవించాలని వుంది నాకు."

"మిష్టర్ సాగర్! ఐ లైక్యూ. మీతో స్నేహం చేయాలని వుంది" రెండు నిమిషాలు ఆగి అంది చిత్ర.

"స్నేహం వో గొప్ప వరం. స్నేహం అందరితో అతక్క పోవచ్చు. అయినా స్నేహాన్ని యిస్తానంటే ఎలా కాదనగలను? ఎవ రైనా కాదనలేరు"

"అయితే ఓ చిన్న షరతు"

"షరతా?"

"షరతంటే షరతు కాదు. చాలా సింపిల్. ఆ బుడ్డి చెంబు గాడితో మీరు కల్సి తిరక్కూడదు. ఐ హేట్ దట్ డర్టీమేన్ -"

బుడ్డిచెంబుగాడంటే ఎవరో సాగర్‌కి తెల్సు. తన స్నేహితు డిని తన ఎదుటే అవమానం చేయడంతో అతనికి తిక్కరేగింది. తిక్క రేగితే అతడు మంచివాడు కాదు.

"బుడ్డిచెంబుగాడంటే అర్థం కాలేదా? కె. బి. చెంబుగాడు. మా యింటికొచ్చే స్లేవ్. బయటకొచ్చి బడాయిలు పోయే మీ....!"

"మిస్ చిత్రప్రియ గారూ....!"

"నో, నో నోరు తిరక్క అంత బాధ పడక్కరలేదు సాగర్. సింపిల్‌గా 'ప్రియా' అంటే సంతోషిస్తాను."

"ఛీ, అలా అనటానికి సిగ్గులేదూ? యితరుల్లోని మంచిని, గొప్పతనాన్ని గుర్తించలేని కుత్సితులంటే నాకు మంట. అది వాళ్ళ హీనత్వానికి, సంకుచిత స్వభావానికి నిదర్శనమే గాని గొప్పతనం మాత్రం కాదు. అలాంటి దౌర్భాగ్యుల పట్ల జాలి చూపుతాడు వేద వ్యాస్. కాని నేను పిస్టలు వుంటే కాల్చిపారేస్తాను. గుడ్ బై "సాగర్ కోపంగా యీ మాటలన్నీ అనేసి చకచకా నడిచి పోయాడు.

"బ్రూట్" అనుకొని పళ్ళుకొరుక్కుంది చిత్రప్రియ.

యిదంతా అల్లంత దూరాన నిల్చుని ఎటో చూస్తున్నట్లు నటిస్తూ అంతా చూచి. విన్న వొక యువకుడు ఆమె దగ్గరకొచ్చాడు.

"ఎక్స్క్యూజ్‌మీ మేడమ్" అన్నాడు చాలా మృదువుగా.

అలా అన్న యువకుడి పేరు శ్రీ మహావిష్ణువు.

శ్రీ మహావిష్ణువు ఆ వూరుకొచ్చి నాలుగురోజులే అయింది. కాలేజీలో బి. కాం లో చేరి రెండు రోజులు కూడా కాలేదు.

# 4

శ్రీమహావిష్ణువు ఎక్కడుంటే అక్కడ ఆలజడి వుంటుంది.

గ్రూపుల్ని కట్టటంలో, గ్రూపుల్ని చీల్చటంలో - వుద్యమాల్ని లేవదీయటంలో అతను సిద్ధహస్తుడు.

ఆడపిల్లల్ని వేటాడటం అతని రెండో హాబీ. మనిషిరూపం చాలా అసహ్యంగా వుంటుంది. కాని మాటల్లో మాత్రం మెస్మరిజం వుంది.

శ్రీ మహావిష్ణువుకు డబ్బుంది. వాళ్ళ నాన్న దేవిడ్ మహమద్ సేల్సుటేక్సు ఆఫీసరు. వాళ్ళతాత వో చర్చికి ఫాదర్. మతప్రచారం కోసం విదేశాలనుండి టోలెడంత డబ్బు వస్తుంది.

ఆడపిల్లల్ని ఆకర్షించటానికి అతని ఆయుధాలు- డ్రెస్సు. మాటలు, అడపా దడపా విదేశీ ద్రవ్యాన్ని ఎరగా పెడతాడు.

"ఎక్స్క్యూజ్‌మి మేడమ్" అంటూ పలకరించిన అతన్ని చూసింది చిత్రప్రియ. తెల్లటి బట్టల్లో కొండముచ్చుకు సున్నం పూసినట్లు కనబడ్డాడు.

"వట్టి బ్రూట్ లాగున్నాడు. మీకు బాధ కలిగించి పోతున్నాడు" వెళ్తున్న సాగర్ నుద్దేశించి అన్నాడు.

"కాని మీరెవరు? మిమ్మల్ని మా విషయంలో ఎవరు జోక్యం కలిగించుకోమన్నారు?"

"మీ అందాన్ని ఆరాధించే వాడిని నేను" - ఆ మాట సాగర్

అంటే సంతోషించేది. కాని యీ కొండముచ్చు అంటే అంతగా సంతోషించలేకపోయింది. అయినా మనసులో ఏదోమూల ఆనందం!

శ్రీ మహావిష్ణువు తనను గురించి చెప్పుకొన్నాడు.

శత్రువులను సాధించటానికి అతను బ్రహ్మాండమైన ఆయుధంగా కనిపించాడామెకు.

"నేను సినిమాకని బయల్దేరాను.కుమారిలో మంచి పిక్చర్ వుంది. యిఫ్‌యు డోంట్ మైండ్....!"

తను సాగర్ అడిగినట్టుగానే అడుగుతున్నాడు అతను. కాని అతను కాదన్నట్టు తిరస్కరించలేదు.

"సారీ. నాకిపుడు వేరే పనుంది క్షమించండి. మరోసారి మీ కోరిక మన్నిస్తాను" అంటూ రిక్షా ఎక్కింది.

## 5

మర్నాడు సైన్సు క్లాకుకు వెళ్లింది కృష్ణప్రియ. "హాయ్"అంటూ పలకరించాడు శ్రీ మహావిష్ణువు. అప్పుడు ఆడపిల్లలందరి మధ్య వుందామె. అందరిమధ్యలో వుండగా వో స్టూడెంట్ అలా పలకరిస్తే ఆమెకు అగౌరవంగా తోచలేదు. కాగా ఆనందించింది. గర్వంగా యితర ఆడపిల్లల్ని చూచింది. "హాయ్ విష్ణూ" అంటూ దగ్గరకెళ్లింది.

"మనిద్దరికీ స్నేహం కల్సి యివాల్టికివారం. సెలెబ్రేట్ చేసుకొందాం. సాయంత్రం గోదావరి బంచ్ దగ్గరకురా! ఆ రోజు ఇచ్చావు నా కోరిక మన్నిస్తానని. వారం రోజులు పూర్తయిన ఈ శుభ సమయంలో....!"

కాదనాలనుకొంది మనసులో కాని నోటితో"సరే" ననేసింది

"వెల్‌కం మై డియర్" అంటూ ఆహ్వానించాడు వస్తున్న చిత్రప్రియను.

గోదావరి మామూలుగానే గంభీరంగా వయ్యారాలు పోతోంది; అందాలను వెదజల్లుతోంది.

"పంచవటికెళదామా?"

"ఎందుకు?"

"మన స్నేహాన్ని సెలెబ్రేట్ చేసుకోడానికి. గోదావరి ఒడ్డునే ముంది? మట్టి, మురికి తప్ప"

"వారం రోజుల స్నేహానికే సెలబ్రేషన్ ఏంటి?"

"నీతో స్నేహం ప్రతిక్షణం విలువైనదే నాకు, ప్రియా! ఇవాళ నేను చాలా మంచిమూడ్‌లో వున్నాను. నామాట కాదనకూడదు నువ్వు"

"ప్లీజ్. నన్నలా పిలవకండి. చిత్రప్రియని పూర్తిగా పిలిస్తే సంతోషిస్తా" కొంచెం తీక్షణంగానే అంది.

"ఆల్ రైట్. అమ్మగారిమాట శిరసావహిస్తా. జయశ్రీలో మంచి పిక్చర్ వుంది. కాదనకుండా రావాలిచిత్రప్రియగారూ!" ఆ అన్న తీరుకు ఆమెకు నవ్వు వచ్చింది. కాగా అతనెంత మంచివాడు! తను వద్దనగానే వప్పేసుకున్నాడు.

స్నేహితుడితో సినిమాకెడితే తప్పేముంది?

పంచవటిలో కాఫీ తీసుకున్న తర్వాత జయశ్రీ కెళ్ళారు.

లైట్లు ఆరిపోయి సినిమా మొదలైన అయిదు నిముషాలకే తప్పయిపోయిందనుకోసాగింది. ఏదో మిషమీద మాటిమాటికి అతనామెను తాకుతూనే వున్నాడు.

ఆమెకు సినిమామీదకి మనసు పోలేదు. అతని చర్యలనే గమనిస్తోంది.

అతను సినిమాలో పూర్తిగా మునిగిపోయినట్లు నటిస్తున్నాడు.

కొంచెంసేపు గడిచింది. చిత్రప్రియ అప్పుడే సినిమామీదకి మనసు లగ్నం చేస్తోంది.

ఆమె భుజాన్ని వొకచెయ్యి తడుముతోంది. మరోచెయ్యి ఆమె చేయిని వెతుకుతోంది. ఆ చేయి చిక్కింది. 'ప్రియా' అన్నాడు పరవశంగా మహావిష్ణువు.

ఆమె మహావిష్ణువువైపు చూసింది. రెండుచేతుల్ని తోసిపారేసింది.

కుర్చీలోనుంచి చివాలున లేచి వెళ్ళిపోయింది.

'కొత్తపిట్టకదూ! భయపడుతోంది' అనుకొన్నాడు శ్రీమహావిష్ణువు!

# 6

శ్రీమహావిష్ణువు ప్రమాదకరమైన వ్యక్తిగా గ్రహించింది చిత్రప్రియ.

అతనంటే అసహ్యంకూడా పెరిగిపోయింది. రాత్రి జరిగిన సంఘటనతో సిగ్గుపడి యిక తనతో మాట్లాడటం మానేస్తాడని ఆశించింది.

కానీ కాలేజీ గేటుదగ్గరే కాపలాకాచాడు. ఆమె దగ్గరికి సమీపించగానే "హాయ్ గుడ్‌మార్నింగ్" అంటూ విష్‌చేసి ఆమెవెనక నడిచాడు. ఆమె అతనివైపు చూడలేదు.

"కోపం వచ్చిందా? వస్తే క్షమించు. నువ్వింత ఫ్రెడిషనిస్టువనుకోలేదు. పొరపాటే"

"ట్రెడిషనిస్టునా నేను?"

"కాకపోతే సంతోషమే. కాని యీ కాలంలో మీదచెయ్యి వేస్తే కోపగించుకొనే స్త్రీలున్నారా? అందులోనూ కాలేజీ స్టూడెంట్సు!"

"నా కలాంటివి యిష్టంలేదు-"

"తెల్సిందిగా? యిక మళ్ళీ అలాంటి పొరపాటు జరగకుండా చూసుకొంటాడీ దాసుడు. క్షమించమన్నాగా!"

క్షమించక తప్పలేదు చిత్రప్రియకు.

ఏ సాగర్‌ని సాధించాలని చిత్రప్రియ శ్రీమహావిష్ణువుతో స్నేహం చేసిందో, ఆ సాగర్ ఆ విషయాన్నే పట్టించుకోలేదు. కాని వేదవ్యాస్ అలా వూరుకోలేకపోయాడు.

గోదావరి బండ్ దగ్గర జరిగిన విషయాన్ని సాగర్ పూర్తిగా చెప్పకపోయినా చెప్పిన కాస్తలోనే ఎంతో వూహించ గలిగాడు. ఆ తర్వాత వాళ్ళిద్దర్ని పంచవటి హోటల్లో చూచినవాళ్ళు, జయశ్రీ సినిమాహాల్లో చూచినవాళ్ళు అతనికి చెప్పేరు, అతను కాలేజీలో వాళ్లిద్దరూ మాట్లాడుకోటం స్వయంగా ఎన్నోసార్లు గమనించాడు.

శ్రీమహావిష్ణువును చూడంగానే ప్రమాదకరమైన జంతువుగా పసిగట్టేడు. ఆ జంతువు కోరల్లో చిత్రప్రియ....?

అతని కళ్ళల్లో కామాక్షమ్మ, నమశ్శివాయ మెదిలేరు.

నమశ్శివాయ దగ్గర అతనికంత చనువు లేదు. యిన్నేళ్ళుగా ఆయనింట్లోవున్నా ఆయనకి యితనితో మాట్లాడాల్సిన అవసరం ఎన్నోసార్లు కలుగలేదు. అతనిక్కావల్సినవన్నీ కామాక్షమ్మగారే చూసేది.

సమయం చూచి ఆమెతో చిత్రప్రియ పెళ్ళి విషయం ప్రస్తావించాడు.

"ఏమిటి కథ? తలిదండ్రులం మాకు లేని తొందర నీకొచ్చింది దాని పెళ్లికి....కొంపదీసి అది కాలేజీలో...."

"అవన్నీ ఎందుకమ్మా? చిన్నవాడినైనా నా సలహా పాటించండి___"

కాని అంతటితో వూరుకోలేదు కామాక్షమ్మ. కూతుర్ని నిలవేసింది.

"ఏమే, నువ్వు ఆడపిల్లవి. గుర్తుందా?"

"యీ జడ, చీరెలు, జాకెట్లు, బొట్టు, నగలు.... మర్చిపోనిస్తాయా?"

"మర్చిపోయి తిరుగుతున్నట్లు తెల్సిందిలే"

"బుద్దిచెంబుగాడు చాడీలు చెప్పటం నేర్చుకున్నాడన్నమాట"

"అతని మీద ఎందుకలా విరుచుకు పడ్తావ్? నిజమా, కాదా?"

"నిజమైతే? తలదీసి మొలేస్తాడా ఆ బెగ్గర్‌గాడు?"

పెళ్ళి సంబంధాలు చూడాలంటూ ఆ రోజే భర్తకు నోటీసిచ్చింది. ఆయన ఆరోజే ఆ విషయం చూడండని సూరిశాస్త్రికి, మరి కొందరికి ఆర్డర్లు జారీ చేశాడు.

మరుసటి రోజు వేదవ్యాస్‌ను నిలేసింది చిత్రప్రియ.

"చాడీలుకూడా చెప్తున్నావట! యిట్లయితే ఆ ముష్టి నాలుగు మెతుకులు కూడా పోతాయి. గుర్తుంచుకో."

"పర్వాలేదు. నాకు మెతుకులు పోతే మరోచోట సంపాదించుకోగలను. కాని ఆడదాని శీలం పోతే...."

"అబ్బ! బయలుదేరాడయ్యా వీరుడు. శీలంట! శీలం! నా శీలం సంగతి నీకెందుకు? నువ్వేమైనా నన్ను పెళ్ళిచేసుకోబోతున్నావా?"

"అందని పళ్ళకోసం అర్రులు చాచను. అందని దానికోసం విచారించను" సాగర్ విషయంలో ఆమె కోరికల్ని దృష్టిలో పెట్టుకొని అన్నాడతను. కాని అతనికి తనని చేసుకోవాలని వున్నట్లు అర్థం స్ఫురించింది చిత్రప్రియకు. ఆమెకు తెలీకుండానే ఆమె మనసొకక్షణం పులకించింది.

"అందితే కాదనవుగా! .... ఏం మాట్లాడవ్!"

"కాదంటాను—"

దెబ్బతిన్నది చిత్రప్రియ. అవునంటే అతనిముందు మోకరిల్లే స్థితిలో వుందామె.

"ఏం, నేనందంగా లేనా? నీ బుడ్డిచెంబు మొహానికి తగనా? యింతోపి కలెక్టరివి-నీ స్టేటస్‌కి నేను తగనా?"

"మీ స్టేటస్‌కి నేను తగననే కాదంటాను. మీరు నాకన్నా కాదు- చాలామంది స్త్రీలకన్నా-అందగత్తెలని గుడ్డివాళ్ళుసైతం చెప్ప గలరు. మీ అందం సూర్యబింబంలా, చండప్రచండంగా వెలిగేది"

ఆమె మరోసారి తన్మయత్వం చెందింది. ఆడపిల్లలంతా ఆరాధించే, మగపిల్లలంతా బ్రహ్మరథం పట్టే యువకుడు తనని అందగత్తెగా అంగీకరిస్తున్నాడు. కానీ....

"అందుకేనా మీరందరూ ఇందిర చుట్టూ తిరుగుతుంటారు"

"నేనెవరి చుట్టూ తిరగను"

"అవును అదే నీచుట్టూ తిరుగుతుంది. ఆడపిల్లల్ని నీ చుట్టూ తిప్పించు కోవాలని నీ కోరిక. గొప్ప కదూ?"

"మీరు నన్నుగురించి ఏమైనా అనుకోండి. అందరిలో అనండి. నాకు బాధలేదు. కాని నేను మాత్రం మీ ఆనందాన్ని, సౌఖ్యాన్ని మాత్రమే కోరుకుంటాను. అందుకేమైనా చేస్తాను"

"అంటే.... పెళ్ళికూడా నేను చేసుకోమంటే చేసుకుంటావన్న మాట" అంతలోనే ఆమె అతిశయపు గుర్రం ఎక్కింది. "కాని మా యింట్లో గంట వాయించే నీ అంతస్థేమిటో తెల్సుకుని మసులుకో. నీ చుట్టూ తిరగటానికి నేను ముష్టి ఇందిరను కానని గుర్తుంచుకో"

సంభాషణ అంతా వింది కామాక్షమ్మ. అతడు మంచివాడుగానే కనిపించాడు, ఒక్క పొర్లుమాట మాట్లాడలేదు. కాని ఆమెకు

కూతురి మాటలు విన్నాక ఆ పిల్ల మంచితనంపై నమ్మకం పోయింది. ఎంతైనా యీడొచ్చిన వాళ్ళిద్దరూ ఓ కాలేజీలో చదువు తున్నారు. కాగా అతని అందం ఎంత వాళ్ళనైనా ఆకర్షిస్తుంది!

మరుసటిరోజే మంచిమాటల్తో వేదవ్యాస్‌కు ఆ యింట్లోనుంచి ఉద్వాసన చెప్పింది. కూతురు పెళ్లి విషయం భర్త చెవిలో యిల్లు కట్టు కొని పాడసాగింది.

# 7

చెల్లెలు తను యిచ్చిన ఆఫర్‌ని తిరస్కరించాక, సుధాకర్ దృష్టి మంజుల పైన పడింది. మంజుల 'రౌడీ ప్లీడరు' గారి చిన్న కూతురు.

రాజమండ్రి స్టేషన్‌లో రైలుదిగి 'రౌడీప్లీడరు' గారి పేరు చెప్తే చాలు. ఏ రిక్షావాడైనాసరే చౌదరి గారింటికి తీసుకెళ్తాడు. కాని రిక్షా ఎక్కేముందే బాడుగ కాస్తా పుచ్చేసుకొంటాడు. లేకపోతే తీరా యింటికెళ్ళాక "బాడుగలేదు, ఏం లేదుపో" అనేయగల దాప్లీడరుగారు.

చౌదరిగారికి ముగ్గురు ఆడపిల్లలు. అందరూ బ్రహ్మాండమైన అందంగా వుంటారు. అందుకే వాళ్ళమీద లక్ష ఆంక్షలు విధించి చిన్నప్పుడునుంచి పెంచుకొచ్చాడు చౌదరి. మగపురుగుతో మాట్లాడ నీయకుండా జాగ్రత్తలో పడ్డాడు.

పెద్దపిల్లకు యిరవై ఏళ్ళు. మొగుడిని తండ్రి తెస్తాడేమోనని ఎదురు చూచి చూచి, వో అర్ధరాత్రి తనకన్నా వో సంవత్సరం చిన్న వాడైన ఓ కాలేజీ విద్యార్థిని లేవ తీసుకొనిపోయి తిరుపతిలో పెళ్ళిచేసు కుంది.

రెండోపిల్లకి అంత సాహసం లేకపోయింది. తన తపనను, కోరికలని అక్షరాల్లో రంగరించి నవలలురాసి పేరు తెచ్చుకొంది. ఆమెను చూట్టానికి వచ్చే అభిమానుల్లో ఒక డబ్బున్న వాడిని మంచి వుద్యోగం వున్నవాడిని పట్టి వాడికిచ్చి ఆమెను పెండ్లిచేసేడు.

మూడోపిల్ల మంజుల, ముగ్గురిలో అందంగా వుంటుంది, కాని

ముగ్గురిలోకి మంచిది. పెద్దక్కకున్న సాహసం లేదు. చిన్నక్కకున్న రాసే ప్రజ్ఞలేదు. అంచేత మూగగా ఏడ్చే మార్గం మాత్రమే మిగిలింది.

అలాటి స్థితిలోనే సుధాకర్ వో నాటకం వేస్తూ చౌదరిని ముఖ్య అతిథిగా ఆహ్వానించాడు. చౌదరికి అలాంటి గౌరవం పొందా లని ఎన్నాళ్ళగానో వుంది. కాని ఎవ్వరికీ కానీ చందా యివ్వడు. అందుకే యింతవరకు లభించలేదు.

సుధాకర్ అయన్ని చందాకోసం పిలవలేదు. మంజులకోసం పిల్చేడు.

మంజుల సుధాకర్ చదువుతున్నప్పుదే కాలేజీలో చదివింది. ఆతన్ని చూచిన దగ్గర్నుంచి కళ్ళతోనే మాట్లాడసాగింది. అతనామెతో ఎన్నోసార్లు మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని ఆమెకు మాట్లాడా లంటే భయం. తండ్రి ఆంక్షల్లో అదొకటి. ఆయన కాలేజీకొచ్చి చూదొచ్చాడుట్లే అనుకొందామంటే తండ్రి తనని కనిపెట్టటానికి కొందరు సి. ఐ. డి. లను పెట్టినట్లుకూడా ఆమెకు తెల్సు.

సుధాకర్‌ని చూచినప్పుడు ఆమె వొక కంటిలో ప్రేమ, కోరిక- రెండో కంటిలో భయాందోళనలు కన్పించేవి. కళ్ళతో దగ్గరికి పిలుస్తూనే, కాళ్ళతో దూరంగా పారిపోయేది.

మంజులని చూచాక, ఆమె చూపులు హృదయానికి గుచ్చు కొన్నాక, సుధాకరానికి ప్రేమంటే ఏమిటో తెల్సింది. మంజులను ప్రేమించాడు. కాని ఆపిల్ల మాట్లాడదు, ఎవరితో చెప్పుకోటం?

తెగించి వోసారి మంజులను కాలేజీలో నిలేశాడు

"మంజులా...."

"మానాన్న...."

"యిది కాలేజీ"

"మా నాన్న హిరణ్యకశపుడు"

"అయితే నేను నరసింహస్వామిని"

"నావైపు ఎందుకలా చూస్తావ్?"

"నాన్నకు తెలిస్తే చంపేస్తాడు"

"యీ వొక్క ప్రశ్నకు సమాధానం చెప్పు పోనీ. నన్ను ప్రేమిస్తున్నావా?"

ఆమె నోటితో సమాధానం చెప్పలేదు. కళ్ళ చూపుల్తోనే అతన్ని బిగియారా కౌగిలించుకొంది. అంతలోనే ఆమె కళ్ళు లేడి కళ్ళయ్యాయి.

"పి. ఐ. డి లు...."

"నోటితో మాట్లాడటం అంత భయం అయితే ఉత్తరాలు రాయరాదూ?"

"అమ్మో! ఉత్తరాలే....! నాన్న...." అంటూ తుర్రుమంది.

మర్నాడు ఆమె అందాన్ని వర్ణిస్తూ, ఆమెను తనెలా ప్రేమిస్తున్నదీ వర్ణిస్తూ బ్రహ్మాండమైన వో ఉత్తరం రాశాడు. ఆమె వొంటరిగా వుండటం చూచి చేతికిచ్చాడు. ఆమె బెదురు కళ్ళతో అటూ యిటూ చూచింది. ఉత్తరాన్ని జాకెట్టులో దాచేసుకొంది.

సమాధానం కోసం మర్నాడు అక్కడే కల్సేడు. ఆమె అతన్ని చూస్తూనే ఉత్తరం పుస్తకంలో నుంచి తీసింది. హృదయానికి హత్తుకొంది. జాకెట్టులో మళ్ళీ పెట్టేసుకొంది. అది అతని ఉత్తరమే.

తనని ప్రేమిస్తున్నానని చెప్పేసింది. ఫర్వాలేదు కాని పెళ్ళి? ఆ విషయం ఎలా? అతనామెను సమీపిస్తుంటే ఆమె కళ్ళు బెదిరి పోయాయి. "నన్నేమీ అడగొద్దు. ప్లీజ్" అన్నట్లు అర్థించింది.

"కాలేజీలో నీ కంత భయమైతే ధవళేశ్వరంలో కల్సుకొందామా?"

"అమ్మో....నాన్న...."

"పోనీ సినిమా హాల్లో?"

"నాన్న...."

"మరి నన్ను పెళ్ళెలా చేసుకొంటావ్?"

"నాన్న....అమ్మో!"

"నాన్న నాన్న అని అంత భయపడే దానివి నన్నెందుకు ప్రేమిస్తున్నావ్?" చిరాకొచ్చి కొంచెం గట్టిగా అన్నాడు.

అప్పుడామె కళ్ళు చూడాలి. వొకవైపు అసహాయతకు కన్నీరు

కార్చేయి. మనోవైపు నువ్వుతప్ప నాకెవ్వరూ లేరంటూ ప్రేమామృతాన్ని వర్షించాయి.

సుధాకర్‌లోని నటుడు ఆమె కళ్ళద్వారా వెలిబుచ్చే అభిప్రాయాలని చూచి దిగ్భ్రాంతి చెందేడు!

"ఏడవకు మంజూ! నీ పరిస్థితి నాకర్థమయింది. అలనాడు రుక్మిణిని కృష్ణుడు తీసుకెళ్ళినట్లు, నిన్ను నేను తీసుకెళ్ళి పెళ్ళి చేసుకొంటాను. దిగులుపడకు"

అప్పుడామె కళ్ళల్లోని భావాల్ని ఎలా వ్రాయటం.? అన్ని భాషల్లోని పదాలన్నీ కలిపినా అసాధ్యం!.

"థేంక్స్" అంటూ వెళ్ళిపోయింది.

చదువయి పోయింది యిద్దరికీ. ఆమె పంజరంలో నుంచి బయటికొచ్చే ఆ కాస్త అవకాశం కూడా పోయింది.

సుధాకర్ ఆమెను కల్సుకోటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఫలించలేదు.

ఆ యింటి మేడపైన కిటికీలోనుంచి ఆమె కళ్ళు మాత్రం పోయినప్పుడల్లా కన్పించేవి. ఆ కళ్ళు తనకోసం ఎప్పుడూ అలా నిరీక్షిస్తుంటూనే వుంటాయని అతనికి తెల్సు.

చెల్లెలు వేషం కోసం వెతుకుతున్న సుధాకర్‌కు మంజుల మనసులో మెదిలింది. ఆ కళ్ళు కన్వేచేసే భావాలు కదిలేయి. కాస్త ప్రయత్నిస్తే జయబాధురినే బీట్ చెయ్యగలదనుకొన్నాడు.

యిక లాభం లేదు. మంజులని ఆ పంజరంలోనుంచి తప్పించక తప్పదు.

ఎలాగూ యిక అతనా వూళ్ళో వుండే ప్రసక్తి లేదుకనుక చౌదరి 'రౌడీత్వాన్ని' చూపుతాడన్న భయంలేదు. కాని మంజులను మద్రాసుకు రావటానికి వప్పించటం ఎలా? అసలు తన వూహల్ని చెప్పటం ఎలా?

కోటలో పాగా వెయ్యాలనుకొన్నాడు. చౌదరిగారిని ముఖ్య అతిథిని చేశాడు.

తన నాటకాన్ని చూచి మెచ్చుకొంటే ఆయనతో పరిచయాన్ని పెంచుకోవచ్చు. యింటికి రాకపోకలు సాగించవచ్చు. మంజుల కూడా

నాటకానికొస్తే నటుడిగా తన సత్తా ఏమిటో తెలుసుకొంటుంది. అప్పుడు సినిమా ఆలోచనకు ఆమెను వొప్పించటం తేలిక. కాని ఆయన మంజులని తీసుకొస్తాడా?

నాటకం రోజు అప్సర హోటల్ దగ్గర నిలబడి ఆయనకోసం చూస్తున్నాడు. చిత్రం! ఒక్క మంజులేకాదు. కుటుంబం యావత్తుతో దిగేడు.

గొప్ప హంగామాతో ఆయన్ని రిసీవ్ చేసుకొన్నాడు. చౌదరికి చంద్రమండలం పోయినంత పనయింది.

"వెల్‌కం టుయూ" అంటూ మంజులని కళ్ళతో ఆహ్వానించాడు. ఆనందాన్ని తెలిపేడు. రెండో అంతస్తులోవున్న అప్సరా కళామందిరానికి అందర్నీ తీసికెళ్ళాడు.

నాటకం అయినాక సభ. ఏంమాట్లాడాలా అని ఆలోచిస్తున్నాడు చౌదరి.

మంజుల అలాంటి నాటకాలని ఎప్పుడూ చూడలేదు. చౌదరి అప్పుడప్పుడు సినిమాలకు మాత్రమే తీసికెళ్తాడు. ఆ మాటకొస్తే చౌదరికూడా ఎన్నడూ చూడలేదు యీ వచన నాటకాల్ని. నాటకాలంటే పద్యాల నాటకాలేనని ఆయన అభిప్రాయం. చిన్నప్పుడు వాటిని చాలా చూచాడు.

కాని నాటకం ప్రారంభమయ్యాక చుట్టూవున్న అందమైన ప్రకృతిని విస్మరించి నాటకంలో లీనమైపోయింది మంజుల.

నాటకం తర్వాత ఏం మాట్లాడాలా అన్న ఆలోచనని మర్చిపోయి నాటకం ఆసాంతం చూచాడు చౌదరి.

ఆయన్ని స్టేజీ మీదికి ఆహ్వానించాడు. పెద్ద పూలదండ వేశాడు సుధాకర్. ఫోటో తీశారు. ఉబ్బితబ్బిబ్బయ్యాడాయన.

ఆ పూలదండ సుధాకర్ తన మెళ్ళోనే వేస్తున్నట్లు సంతోషించింది మంజుల.

"చాలా కృతజ్ఞులం సార్. పెద్దవారు మీరు రావటమే గౌరవం. కాగా, మమ్మల్ని చాలా మెచ్చుకొన్నారు. అదంతా మీ ఆశీర్వచనం క్రింద స్వీకరిస్తున్నాం" కారెక్కబోతుండగా అన్నాడు చౌదరితో సుధాకర్.

"అదేంటోయ్? నేను కృతజ్ఞతలు చెప్పుకోవాలి. వృద్ధిలో కొస్తావ్. మంచి నటుడివి నువ్వు. నువ్వు రేపోమారు మాయింటికిరా. మాటాడుకొందాం" అంటూ కారెక్కాడు.

"అమ్మయ్య! కృషి ఫలించింది" అనుకొని తృప్తిగా నిట్టూర్చాడు సుధాకర్!

# 8

మర్నాడు వెళ్ళేసరికి చౌదరిగారు లేరు యింట్లో. మంజులే అతన్ని రిసీవ్ చేసుకొంది.

"బంగారు తలుపులు సులభంగా తెర్చుకొన్నాయిగదాని ఆశ్చర్యపోతున్నా. ఆనందిస్తున్నా. గర్భ గుళ్ళోని ఆ దేవతాదర్శనానికి యింకేం చేయాలా అని ఆలోచిస్తుంటే, ఆ సౌందర్య దేవతే గుమ్మం దగ్గర దర్శన మిచ్చింది. వాటె లక్కీ మేన్ అయాం!"

"మీరుకాదు లక్కీ, నేను" అంటూ జరిగింది చెప్పింది మంజుల.

రాత్రి నాటకం చూచి వస్తున్నంతసేపు కారులో చౌదరి సుధాకర్‌ని గురించే మాట్లాడేడు. డ్రైవరు దగ్గర అతని ఆరాలు తీశాడు.

"నా మూడో అల్లుడు యిలాంటి వాడుంటే బాగుంటుంది" అంటూ మంజుల వైపు చూచాడు "నువ్వేమంటావ్ అమ్మాయ్?" అన్నట్లు.

వెదకపోయిన బంగారు తీగె కాళ్ళ కడ్డంపడింది. కాదనగలదా? 'మీ యిష్టం నాన్నారూ' అంది.

"అతనికి అందం వుంది. ఆస్తి వుంది. బతకనేర్చిన తెలివి తేటలున్నాయి. చదువు అంతగా లేకపోయినా యివి నెట్టేస్తాయి, కాపీ ఎటొచ్చీ అతని కులం వేరు.మన కులం వాడైతే బాగుండేది" అన్నాడు ఆలోచనగా

"మనకన్న హెచ్చు కులమేగా?"

ఆ మాట అన్న భార్యను మింగేలా చూచాడు. "అలా అనాదిగా అనుకోబట్టే వాళ్ళకు కొమ్ములొచ్చాయి. నేను బ్రాహ్మణుల్ని ఎక్కువ కులం వాళ్ళుగా పరిగణించను. అతనొచ్చి అమ్మాయినడిగితే ఆలోచిస్తా. నేనుగా నేను బ్రాహ్మడిని నా కూతుర్ని పెళ్ళిచేసుకో అనలేను-"

మంజుల గుండెల్లో రాయిపడింది. ఒక్క క్షణం నిశ్శబ్దం.

"మంజూ, రేపు అతనొస్తాడు. అతని అభిప్రాయం ఏమిటో తెల్సుకో. ఆ తర్వాత కథ నెటు నరుక్కురావాలో ఆలోచిద్దాం——"

జరిగింది విన్నాడు సుధాకర్. మంజుల ఆశించినట్లు ఎగిరి గంతు వేసి ఆమెను దగ్గరకి తీసుకోలేదు.

మంజులని చేసుకోటానికి అతని కభ్యంతరంలేదు. అందుగ్గాను తలితండ్రుల్ని అవసరమైతే ఎదిరించటంకూడా ప్రశ్నకాదు. కాని తన ప్రణాళిక- సినిమా.

"సినిమా తియ్యటానికి వొప్పుకుంటాడా మీ నాన్న? నువ్వు సినిమాలో నటించటానికి అంగీకరిస్తావా?"

"సినిమానా!!"

తన ప్రణాళిక చెప్పేడు సుధాకర్.

"అమ్మబాబోయ్! నేను సినిమాల్లో నటించటమే? నాన్న చంపేయడూ? అయన గౌరవానికి అది భంగంకాదూ?"

"అందుకే మా నాయనల్తో మీ నాయనల్తో మనం పెట్టుకోవద్దు. మద్రాసు వెళ్ళి పెళ్ళి చేసుకొందాం. సినిమా తీద్దాం. లేకపోతే సినిమాతీసి పెళ్ళి చేసుకొందాం"

మంజులకి ఈ గొడవలన్నీ అర్థంకాలేదు. కాని సుధాకర్ తనని మోసం చేయడు. అతను తనకి కావాలి. అతనికి తనంటే ప్రేమ. తనకోసం ఏ సాహసాన్నైనా చేస్తాడు.

"నాకివన్నీ తెలియవు. మీరేం చేయమంటే అది చేస్తాను. కాని నాన్న ...."

"యీ సుధాకర్ నీ దగ్గరుండగా మీ నాన్నకాదు, ఆ యమధర్మ రాజుకూడా ఏం చెయ్యలేడు మంజూ...."

అంటూ ఆమెకి చెప్పాల్సిందంతా చెప్పేడు. ఆమె తల వూపింది.

అతను వెళ్దామనుకొంటుండగా చౌదరి వచ్చాడు. "అయితే నువ్వు నమశ్శివాయ కొడుకువన్నమాట!" అంటూ. మరికొన్ని ప్రశ్న లకి సమాధానాలిచ్చి. ఆయన తెప్పించిన కాఫీ. టిఫిన్లు పుచ్చుకొని వచ్చేశాడు.

"అప్పుడప్పుడూ వస్తూండు" అన్నాడు అతను వెళ్తుండగా.

మంజుల సమస్య అంత తేలిగ్గా పరిష్కారమయ్యేక సుధాకర్‌కి కొండంత బలం వచ్చింది.

సినిమాకి అన్ని ఏర్పాట్లు పూర్తి అయినట్లే. డబ్బు సంపాదిస్తే నెల తిరిగేసరికి పిక్చర్ రిలీజ్ చేయవచ్చు.

కాని డబ్బు....? తండ్రి నడక్కతప్పదు....కాదంటే?

యీ ఆలోచన యింతవరకు ఎవరికి రాలేదు. నమశ్శివాయ కాదనటం యింతవరకు ఆ యింట జరుగలేదు.

కాని ఇది వందల్తో. వేలతో అయ్యేదికాదు. లక్షల్తో వ్యవహారం.

అధమపక్షం లక్షన్నా వుంటేకాని రంగంలోకి దిగటానికి లేదు.

యివ్వనంటే తన ఆస్తి తనకు పంచమని అడక్కతప్పదు. అసలు తమకున్న ఆస్తి ఎంత? పంచుకొంటే తనకు లక్షన్నా వస్తుందా?

తండ్రి ముందు కెళ్ళిందాకా వెనుకముందాడేడు. వెళ్ళాక ధైర్యం వచ్చింది.

"నాక్కాస్త డబ్బు కావాలి"

"నా ముందుకొస్తే అదేగా అర్థం? ఎంత"

లక్ష అని చప్పున చెప్పలేకపోయాడు.

"ప్రస్తుతానికి వోవంద చాలుతుందా?"

"వొక లక్ష కావాలి"

అకస్మాత్తుగా కత్తిపట్టుకుని నిన్ను చంపుతానన్నా. అంతగా దిగ్భ్రమ చెందాడు నమశ్శివాయ!

"ఎంతన్నావ్!!"

"లక్ష"

"లక్ష! లక్షరూపాయలే!"

"మరి సినిమా తియ్యటమంటే మాటలా?"

ఓంనమశ్శివాయకంతా అర్థమయింది.

"సినిమా ఎందుకు తియ్యటం!?"

చిన్నపిల్లాడి ప్రశ్నలా కనిపించి వొళ్ళు మండింది సుధాకరానికి.

"మీరు లాయర్‌గా ప్రాక్టీస్ ఎందుకు చేయటం! కోర్టు కెందు కెళ్లటం?"

అవును, ఎందుకు? న్యాయాన్ని వుద్ధరించటానికా? ధనాన్ని సంపాదించటానికా?... రెండూ కాదనిపించింది నమశ్శివాయకు. 14x5

"లక్ష రూపాయలు అడగంగానే చేబదుల్లా యివ్వటానికి మనం కోటీశ్వరుల మనుకొంటున్నావా?"

"ఊళ్ళో మననిచూచి అంతా అదే అనుకొంటున్నారు. మీరు చేసే ఖర్చుచూచి నేనూ అదే అనుకొంటున్నా"

"అది దానం, ధర్మం, దయాదాక్షిణ్యం, పుణ్యం, పురుషార్థం"

"యిది కళాసేవ. కాకపోతే వ్యాపారం. పెట్టుబడి లక్ష పది లక్షలు కావచ్చు"

"కాకపోతే?"

"మీకు పుణ్యం రాకపోతే?"

"సినిమాలు తీసేటంత ధనవంతులం కాదు మనం."

"కాకపోతే సినిమాతీసి అవుదాం. ముందు మనం ఎంత ధన వంతులమో చెప్పండి."

"నా కసలు సినిమా తీయాలన్న ఆలోచనే నచ్చ లేదు"

"నాకు మీరు చేసే ఖర్చేమీ యిష్టంలేదు. మీకు నచ్చిందా లేదా అని నేనడగలేదు. డబ్బుకావాలని అడుగుతున్నా"

"లేదు"

"లేదూ?"

"ఏమిటి ఎదురు ప్రశ్నలు? అరుపులు. మొండివాదనలు"

"మీకేమిటా అజ్ఞానం? మొండితనం"

"ఆలోచించి చెప్తా"

"ఆలోచించేదేంలేదు, ఇస్తే డబ్బివ్వండి. లేకపోతే ఆస్తి వంచండి. నెలరోజులు గడువు. అంతే."

యిన్నాళ్ళుగా జీవిస్తున్న మిథ్యా ప్రపంచంనుండి వొక్కసారి బయటకొచ్చాడు నమశ్శివాయ. కళ్ళకు కమ్ముకొన్న మాయపొరలు తొలిగిపోయాయి.

చుట్టూవున్న వాస్తవాలని తలుచుకొంటే భయంవేసింది. కళ్లు మూసుకోబోయాడు.

"ఏమండీ, పెళ్ళివారు వచ్చేటయిమయింది. మీరింకా అలాగే కూర్చుంటే ఎలా?" అని పిలిచింది కామాక్షమ్మ.



పెళ్ళి చూపులకెవరో వస్తున్నారనగానే, కామాక్షమ్మ చేసిన హడావుడి అంతా యింతా కాదు. వంట మనిషిని పిలిపించి రకరకాల పిండి వంటల్ని చేయించింది. సూరిశాస్త్రి గారిచేత అభిషేకాలు చేయించింది.

చిత్రప్రియకు యిబ్బందిగా వుంది. తనూ అక్కలాగా పెద్దలు తెచ్చిన వాడిచేత మెళ్లో తాడు కట్టించుకోవాలా? తన కేం ప్రత్యేకత లేదా?

ఎందుకు లేదు? వచ్చేవాడు శ్రీ మహావిష్ణువులాంటి కొండ ముచ్చుగాడైతే తను చేసుకోదు. శ్రీ మహావిష్ణువులాంటి సీమదైనా లాభం లేదు.

సాగర్‌లానో, వేదవ్యాస్‌లానో అందంగావుండి,తన అందాన్ని మెచ్చుకొన్నట్టు కళ్లలో వెలుగు కన్పిస్తే చేసుకొంటుంది.

ఆ వచ్చేవాడు యమ్మెస్సీ ఫస్టుక్లాసులో పాసయ్యాడట. ఏదో కంపెనీలో, హైదరాబాద్‌లో పెద్ద వుద్యోగంట.ఫారిన్ చాన్సు వుందిట. ఆస్థికూడా వుందిట.

సాగర్ని చెప్పుతో కొట్టినట్లవుతుంది.వ్యాస్‌గాడి నోట్లో గడ్డిపెట్టి నట్లవుతుంది.కొండముచ్చుగాడి కిచకిచల బారినుండి తప్పించుకోవచ్చు.

ఆ సమయం రానే వచ్చింది. ఊహించినట్లే అందంగా

వున్నాడు. కాని చిత్రప్రియ ఆశించిన కాంతిరేఖ అతని కంట్లో కని పించలా.

నమశ్శివాయ భయపడేటంత బేరం చెప్పేరు. కట్నం దగ్గర సంబంధం వెనక్కి పోవటానికి వొప్పుకోలేదు కామాక్షమ్మ. చివరి పిల్ల. యిక యింటిలో ఆడపిల్ల పెళ్ళి చేయబోయి చేయబోయామా అంటూ తటపటాయిస్తున్న భర్తను సాధించింది.

హిరణ్యాక్ష వరాలన్నిటికీ అంగీకరించక తప్పలేదు. ముహూర్తాలు పెట్టుకొని తాంబూలాలు పుచ్చేసుకొన్నారు.

కామాక్షమ్మకు పెళ్లిపనులతో తీరిక చిక్కటంలేదు. కాబోయే భర్తను వర్ణించి చెప్పుకోటానికి ఎంతకాలం చాలటంలేదు చిత్రప్రియకు.

ఎటొచ్చీ యీ వుపద్రవాన్ని ఎలా తట్టుకోవాలా అన్న ఆలోచనతో నిద్ర పట్టటంలేదు నమశ్శివాయకు. కానీ నలభై ఏళ్లు ఆలస్యం అయిపోయింది.

# 10

ఆస్తిపాస్తుల లెక్కల్ని చూచుకొన్నాక గాని, నమశ్శివాయకు ఇన్నేళ్లు తనెంత ఖరీదైన జీవితాన్నిగడిపిందీ తెల్సిరాలేదు. తన హయాంలో అమ్మిన భూమిని తల్చుకొంటే ఆయన గుండె గుభీలుమంది.

మధ్యలో గడువని గుర్తుచేస్తూనే వున్నాడు సుధాకర్. కాని యీ లెక్కలన్నీ తేలట్టానికే చాలా టైం పట్టింది.

"యింక నాలుగు రోజులే వుంది" అన్నాడోరోజు.

"చిత్రప్రియ పెళ్ళి మరో పదిహేను రోజులే వుంది. అందాకా ఆగక తప్పదు."

"ఎందుకు? దానికి దీనికి ఏమిటి సంబంధం?"

ఏమని చెప్పగలడు?

"సంబంధం ఏమైతేనేం? ఆగితే వచ్చే నష్టంఏమిటి?"

"ఆగకపోతే మీకొచ్చే నష్టం ఏమిటి?"

"అంతేకాని పెద్ద ముండా కొడుకు ఎందుకు చెప్తున్నాడో విందామని లేదన్నమాట!" చిరాకు పడ్డాడు నమశ్శివాయ. ఆశ్చర్యం వేసింది సుధాకర్‌కి. జాలి కలిగింది.

"సరే ఫాదర్, పెద్దవార మంటున్నారు కనుక మీ మాటే వింటాను. కాని పెళ్లి అయిందాకా ఆగితే మన డబ్బు పప్పుల్లో కల్సిపోయే ప్రమాదం వుంది. కనుక పెళ్ళికొడుకు కట్నంతోపాటు మన డబ్బు మనకు ముట్టజెప్పాలి. ఓకే!"

పోయింది పోయినా యిక జాగ్రత్తగావుంటే జీవితం బాగానే గడిచి పోతుంది. వున్నదానితో కూతురు పెళ్ళయిపోతుంది. లక్ష యిస్తే కొడుకు గొడవ తీరుతుంది. ఆడంబరాలకు పోక జాగ్రత్తగా వుండాలి. ఆ తర్వాతైనా, వచ్చేఆదాయాన్ని తప్ప మరి పొలాల్ని అమ్మ కూడదు.

పొలాల్ని స్వయంగా అమ్ముకురావటానికి ఆలోచించసాగా డాయన.

ఎన్నడో చిన్నతనంలో వదిలి వచ్చిన ప్రాంతం. మళ్లీ యిన్నాళ్ళకు కోనసీమ ప్రకృతిని చూస్తుంటే ప్రాణం లేచి వచ్చి నట్టయింది.

బస్సుదిగి రెండుమైళ్ల దూరంలో వున్న పల్లెటూరికి నడు స్తుంటే ఆయనకు నేలమీద నడిచినట్టు లేదు. పచ్చటి తివాసీపై నడు స్తున్నట్లుంది.

ఏటు చూచినా ఎత్తయిన కొబ్బరి చెట్లు. ఆ కొబ్బరిచెట్ల సమూ హాలు వింతవింత ఆకృతుల్లో, రమణీయమైన చిత్రాలు గీచినట్లు వున్నాయి. కొబ్బరిచెట్ల మధ్య వరిపైరు పచ్చగా పెరిగి గాలికి తలూపు తోంది. పచ్చటి అలలు ప్రవహిస్తున్నట్లుంది.

రాజమండ్రిలో వాసన ఎక్కడా లేదు. ఇక్కడేదో కమ్మటి వాసన. ప్రకృతి కన్య పూసుకొన్న సుగంధ పరిమళం.

భూముల్ని అమ్ముకోటానికి నమశ్శివాయ స్వయంగా రావటమే ఆశ్చర్యం అందరికీ. ఆయన గీచిగీచి బేరమాడుతుంటే మరీ ఆశ్చర్య పోయారు.

ఎగ్రిమెంటు రాసుకొని, ఎడ్వాన్సుతీసుకొని రిజిస్ట్రేషన్ పలానా రోజనుకొని వచ్చేశాడు.

తెల్లవారితే రిజిస్ట్రేషన్. ఆ తర్వాత మరి రెండురోజుల్లో పెళ్లి.

ఆ రాత్రి ఓం నమశ్శివాయ గుండెల్లో బాంబు పేలింది!

భూముల అమ్మకాన్ని, కొనటాన్ని ప్రభుత్వం నిలిపివేసింది. లాండ్ సీలింగ్ చట్టం చేయటానికి ముందు తీసుకున్న చర్య యిది.

యీ వార్తతో పాటు పెళ్లివారు అనుకొన్నట్లుగా బయలుదేరి వస్తున్నట్లు టెలిగ్రాం కూడా వచ్చింది.

# 11

రెండు రోజులు ఎలా గడిచిపోయాయో నమశ్శివాయకు తెలియదు. ఆయన గదినుంచి బయటికి రాలేదు. అవసరం కలగలేదు,

పెళ్ళికి కావాల్సిన ఏర్పాట్లన్నీ వాటంతటవే జరిగి పోతున్నాయి.

ఎటు చూచినా ఆనందం! కోలాహలం!

దిగులు, నిస్పత్తువ, నిస్పృహ నమశ్శివాయలో మూర్తీభవించి వున్నాయి.

యింతవరకు ఆయన అనుభవిస్తున్న బాధని మరొకరికి చెప్ప లేదు. 'చెప్పి బయటపడి పోవడం తప్ప లాభం ఏమిటి? ఎలా కావల్సి వుంటే అలా అవుతుంది. కానియ్' అనుకొని భగవంతుడిమీద భారం వేసి కూర్చున్నాడు గదిలో.

మరో వైపు యీ దిగుళ్ళకు, ఆనందానికీ అతీతంగా కలల్లో తేలిపోతున్నాడు సుధాకర్.

తను సినిమా తీసేడు. హిట్....హిట్....హిట్.

ప్రజలు బ్రహ్మరథం పట్టేరు తనకు. ప్రభుత్వం అవార్డు లిచ్చింది. అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది తనకు.

హాలివుడ్ చిత్రాల్లో నటించటానికి తనకు, మంజులకు ఆహ్వా నం వచ్చింది.

ఆ కలలో వుండగానే వో భయంకరమైన అనుమా వచ్చింది అతనికి.

యింటినిండా చుట్టాలున్నారు. వచ్చేవాళ్ళు. పోయేవాళ్ళు. నౌకర్లు, చాకర్లు....

తండ్రి అసలే పరాకు మనిషి. ఆయన దాచిన డబ్బును కొట్టే యరు కదా?

చివాలున లేచి తండ్రి గదితలుపు తట్టాడు.

"నువ్వా!?" అన్నాడు తలుపు తీసి.

"డబ్బు భద్రంగా వుంది కదా?"

"ఏం డబ్బు?"

"అదే నాకివ్వాల్సిన డబ్బు"

నవ్వాలో ఏడ్వాలో తోచలేదు నమశ్శివాయకు.

"పోనీ, మీకూ బరువు తగ్గినట్లుంటుంది. నా డబ్బు యిచ్చేయ కూడదూ? తెల్లవారటానికి మరో అయిదు గంటలేగా వుంది"

"అప్పులవాడిలా పట్టుకున్నావు కదరా!"

"అప్పులాడినేం ఖర్మ. యజమానిగానే అడుగుతున్నా"

"పిల్ల పెళ్ళి ఎలా జరుగుతుందా అని నేనేడుస్తున్నా"

"కావాలంటే నేనూ మీతో కాస్సేపు ఏడుస్తా. నా డబ్బు నాకిస్తే"

"డబ్బు లేకే యీ ఏడుపంతా"

"డబ్బులేదూ?"

"లేదు"

"భూమి అమ్ముతానంటూ వెళ్ళారుగా?"

అప్పుడు యిక అసలు విషయం చెప్పక తప్పలేదు. వింటూనే తారాజువ్వలా లేచాడు సుధాకర్.

ఆ రాత్రి ఆ గదిలో వో చిన్నసైజు అంతర్యుద్ధం జరిగింది.

యిల్లన్నా కుదువబెట్టి పెళ్ళి జరిపించాలని పట్టుబట్టింది కామాక్షమ్మ. తన భాగానికి యిల్లిచ్చేస్తే అమ్మేసుకుంటానన్నాడు సుధాకర్. ఏదీ వీల్లేదన్నారు మిగతా కొడుకులు.

క్షణంలో యీ వార్త పెళ్ళికొడుకు తండ్రిదాకా పోయింది. ప్రళయకాల రుద్రుడిలా తాండవ నృత్యం చేస్తూ వచ్చాడాయన.

అసలే అంతఃకలహాల మధ్యవున్న ఓంనమశ్శివాయ ఈ బహిః శత్రువును సరిగ్గా ఎదుర్కోలేకపోయాడు. నచ్చచెప్ప లేకపోయాడు.

"కట్నం యిప్పటికిప్పుడు కక్కితే సరి. కాకపోతే అన్ని వొప్పందాలూ కేన్సిల్. అడ్వాన్సుగా యిచ్చింది ఖర్చులకు చెల్లు" అంటూ అల్టిమేటం యిచ్చాడు.

కామాక్షమ్మ వియ్యపురాలు కాళ్ళుపట్టుకుంది. కన్నీళ్ళుకార్చింది.

భార్య ఏడుపు. కొడుకుల గోల. వియ్యంకుడి గర్జనలు—

పరువు. ప్రేమ: నిస్సహాయత్వం, దైన్యత్వం—

యీ స్థితిని ఎదుర్కొనే శక్తిలేదు నమశ్శివాయకు. అందర్నీ ఎవరి మానాన వాళ్ళని వదిలేసి ఓ గదిలోకెళ్ళి తలుపులు బిగించు కున్నాడు.

తెల తెలవారుతుండగా అంతా అయిపోయింది. విడిది ఖాళీ అయింది. పెళ్ళి మండపం వెలవెల బోయింది: బాజాలు బావురు మన్నాయి!!!

# 12

యిదంతా తెలీని వూళ్ళో జనం పెళ్ళికి బయల్దేరుతున్నారు,

ముహూర్తం తొమ్మిదింటికి. తెల్లవారగానే వస్తానన్నాడు సాగర్. తెల్లవారింది. అయినా వేదవ్యాస్ పెళ్ళికి వెళ్ళటమా, మాన టమా అన్నది నిర్ణయించుకోలేక పోతున్నాడు.

యింటికొచ్చిన ఆహ్వానంతప్ప తనను పట్టించుకొన్నవాళ్ళు లేరు. చిత్రప్రియ సరేసరి. కావాలని తనను పిలవకుండా అవమానిం చింది. అది ఆమెకు సర్దా. తన దురదృష్టం- కాని, కామాక్షమ్మగారు:

వాళ్ళు తనని మర్చిపోవచ్చు-దాతలు గనుక!

కాని తను: దానగ్రహీత-మర్చిపోలేడు. అన్నం పెట్టి ఆదరిం చిన అభిమానాన్ని వదులుకోలేడు.

'వెళ్ళాలి-వెళ్ళితీరాలి' అనుకొంటుండగా సాగర్ వచ్చాడు. అప్పుడు లేచి స్నానం చేసి మంచి బట్టలు వేసుకున్నాడు వ్యాస్.

హోటల్‌కెళ్ళి టిఫిన్ చేశారిద్దరూ. సాగర్ పేపరు కొన్నాడు. తెరిచిచూస్తే లాటరీ ఫలితాలు. క్లాసులో టీచర్ బలవంతంగా కొని పించినప్పుడు యిద్దరి టిక్కెట్ల నెంబర్లు సాగర్ రాసి పెట్టేడు.

చూస్తే.... అరె.... చిత్రం....!

మొదటి బహుమతి రెండు లక్షలు వేదవ్యాస్ కొచ్చింది.

"ఒరేయ్. లక్కీ ఫెలో. లక్షాధికారివయ్యావురా. కంగ్రాచ్యులేషన్స్" వెర్రి ఆనందంతో వేదవ్యాస్‌ను కౌగిలించుకొని కేకలేసేడు సాగర్.

క్షణంలో లాటరీ తగిలిన అదృష్టవంతుడిని చుట్టుముట్టారు జనం. ప్రశ్నలు-ప్రశ్నలు-

ఉక్కిరి బిక్కిరయిపోయాడు వ్యాస్. అవతల పెళ్ళికి వేళవుతోంది.

ఎలాగో జనాన్ని తప్పించుకొని నమశ్శివాయగారి యిల్లు చేరుకొన్నారిద్దరూ. ప్రజెంట్ కొందామన్న ఆలోచనకూడా మర్చిపోయారు.

మొగుడు వదిలేసిన పెళ్ళికూతురిలా పందిరి ఏడుస్తోంది. విషయమేమిటో అడగకుండానే చెప్పుకుపోయారెవరో.

"ఇప్పుడే వస్తా" అంటూ వ్యాస్ లోపలికెళ్ళాడు. సాగర్ అక్కడే కుర్చీలో చతికిలపడ్డాడు.

అతన్ని చూడగానే "మా ఖర్మ యిలా కాలింది నాయనా" అంటూ కామాక్షమ్మ భోరుమంది.

ఆమెనెలా ఓదార్చాలో వ్యాస్‌కు తోచలేదు ముందు- అంతలోనే ఓ ఆలోచన తళుక్కుమంది.

"పెళ్ళివాళ్ళు వెళ్ళి ఎంత సేపయింది?"

"తెల్లారకముందే వెళ్ళేరు."

"అయినా హైదరాబాదుకు యిప్పుడేం బండి లేదనుకొంటా. వాళ్ళు యింకా అక్కడే వుంటే యీ ముహూర్తానికే పెళ్ళి జరుగుతుంది." కామాక్షమ్మ నమ్మలేనట్లు చూచింది అతని వైపు.

"నిజం. నా మాట నమ్మండి. నేనిప్పుడు రెండు లక్షల కధిపతిని."

"ఆఁ!" అంది కామాక్షమ్మ.

# 13

వేదవ్యాస్ చెపుతున్నది వినగానే నమశ్శివాయకి ఏనుగంత బలం వచ్చింది. కొండంత ధైర్యం వచ్చింది. బద్ధకం, అలసత్వం, ఉదాసీనత్వం ఆయన్ని వదిలిపోయాయి. పొగడ్తల ట్యూబుకు పంక్చర్ పడింది.

ఆయనలోని అడ్వొకేట్ కుంభకర్ణ నిద్రనుంచి వళ్ళు విరుచుకొని హుషారుగా లేచాడు.

"ముహూర్తానికి అట్టే వ్యవధి లేదు బాబుగారూ. మీరు అంగీకరిస్తే...."

"అంగీకరిస్తున్నాను బాబూ. యీ ముహూర్తానికే నా కూతురు పెళ్ళి జరిపించటానికి అంగీకరిస్తున్నాను.. కాని మానవత్వం లేని ఆ కుష్ఠురోగితో కాదు. విశ్వాసం లేని ఆ కుక్కతో కాదు. అమృత హృదయుడివైన నీతో—" ఆవేశంగా అన్నాడు నమశ్శివాయ.

"ఏమండీ!" అంటూ ఆశ్చర్యపోయింది కామాక్షమ్మ.

"బాబుగారూ...." అంటూ గొణిగేడు వ్యాస్.

"అవును మిస్టర్ వ్యాస్. నీకు తెలివుంది. అందం వుంది. గుణం వుంది. అన్నిటికి మించి ఆత్మవిశ్వాసం వుంది. యీ సుగుణాలన్నీ వున్న వాడిని చేసుకొన్న ఏ ఆడదైనా సుఖపడుతుంది. ఆ ఛాన్సు నా కూతురికివ్వు."

"మీరు ఆవేశం, ఉద్రేకాల్లో వున్నారు. నా మీద మీకంత అభిమానం వున్నందుకు కృతజ్ఞతలు. కాని నా కలాంటి ఆలోచన లేదు. చిత్రప్రియగారిని నేనెప్పుడు ఆ దృష్టితో చూడలేదు."

"అది నీ మంచితనానికి నిదర్శనం నాయనా, కాని యిప్పుడు నేనర్థిస్తున్నాను. ఆ దృష్టితో నా కూతుర్ని చూడు. కావాలంటే కాస్త వ్యవధి తీసుకో. కాని నా యింటికొచ్చి నేనంటే ఏమిటో, నా తాహతేమిటో, నా బేక్‌గ్రౌండ్ ఏమిటో తెల్సుకోకుండా నన్ను.

నా కుటుంబాన్ని అవమానించి వెళ్ళిన ఆ కుక్కల్ని. తోడేళ్ళని మాత్రం మళ్ళీ యీ యింటిగడప తొక్కనియ్యను"

వింటున్న కామాక్షమ్మకు ఆనందాశ్చర్యాలతోపాటు భయం కూడా పట్టుకుంది.

వేదవ్యాస్ పైన కూతురికెలాంటి గౌరవం వుందో ఆమెకు తెల్సు. యీ పెళ్ళి మంచి చేస్తుందా వాళ్ళిద్దరికీ!

"మీ పంతాలూ పట్టింపులు తప్ప అసలు పిల్ల అభిప్రాయం ఏమిటో కనుక్కోవాలన్న ఆలోచన రాదేంటి! పిచ్చిపిల్ల-జరిగినదానికి ఎంత కుమిలిపోతున్నదో!"

"అయితే వెళ్ళి కనుక్కురా. నా అభిప్రాయంకూడా చెప్పు."

"మీరు మాత్రం మీ గది వదిలి రామంటారు! బాగుంది. నేనొక్కదాన్ని దాన్ని వోదార్చలేను. మీరూ రండి."

ఒక్కక్షణం ఆలోచించి నమశ్శివాయ భార్యను వెంబడించాడు. వెళుతూ వెళుతూ "నువ్విక్కడే వుండవోయ్" అని చెప్పి వెళ్ళాడు వేదవ్యాస్‌తో.

వాళ్ళిద్దరూ అటు వెళ్ళగానే సుధాకర్ లోపలికొచ్చాడు.

"కంగ్రాచ్యులేషన్స్. రెండు లక్షలు కొట్టేశారుట. ఊరంతా మీ పేరు మోగిపోతున్నది."

"నాకు మాత్రం అంత సంతోషించాల్సిందేమీ కన్పించలేదు. నీతి నిజాయితీలతో కష్టపడి ఒక్క కానీ సంపాదించిన తృప్తి యీ లక్షల రూపాయలు నా కివ్వలేదు."

"పోతే నాదో సలహా. సినిమా తీసి కళాసేవ చేయకూడదూ! అంతా రెడీగా వుంది. నెలలో పిక్చర్ తీసి మీ చేతికిచ్చేస్తాను."

"ఆ డబ్బులో ఒక్క కానీనికూడా నా స్వంతానికి వాడుకోను. మంచికార్యానికి వినియోగిస్తాను."

"సినిమా తియ్యటం మంచిపని కాదనా మీ ఉద్దేశ్యం?"

"క్షమించండి. అసలు ఆ డబ్బు ఇంకా రాలేదు. వచ్చేక కాని ఏం చేయాలన్నది నిర్ణయించను. కాని ఆ డబ్బులో ఒక్క పైసా కూడా నా స్వంతానికిక్కాని, నా కుటుంబానిక్కాని వాడను.

పిల్లలు పెట్టించే ప్రయత్నంకూడా చేయను. స్పెక్యులేటివ్ బిజినెస్సుల్లో ఖర్చు చేయను."

"ఏమిట్రా అంటున్నావ్? సినిమాకు పెట్టుబడి పెట్టమనేనా?" అప్పుడే వచ్చిన నమశ్శివాయ గంభీరంగా అడిగాడు.

"అడిగితే తప్పా?"

"తప్పా? తప్పున్నరా? మళ్ళీ సినిమా మాటెత్తితే మక్కెలిరగతంతాను."

"అమ్మ పెట్టా పెట్టదు. అడుక్కుతినా తిననియ్యదుట. అలా వుంది మీ ధోరణి. మరొకర్ని అడగటం పరువుకు భంగం అనుకొంటే మీరే యివ్వండి. లేకపోతే నా ఆస్తిని నాకు పంచండి."

"పంచిస్తారా! పంచితే వచ్చేది పూచికపుల్లలే."

"ఆ పూచిక పుల్లల్నే యిటు పారేయండి."

"ఒరేయ్. నీకు తెల్సిన నీ పనికిమాలిన తండ్రి చచ్చిపోయాడ్రా. నీ ఎదుట వున్న యీ నమశ్శివాయ అడ్వకేట్. ఫస్టుక్లాసులో పాసయిన అడ్వకేట్. పిచ్చిపిచ్చి వేషాలింక యీ యింట్లో పనికిరావు. వెళ్ళు"

తండ్రివైపు చూచాడు. హనుమంతుడిలా ఎదిగిపోయినట్లు కన్పించాడు. త్రివిక్రముడిలా అంతటా ఆక్రమించివున్నాడు. కొత్త తండ్రి. భయాన్ని గౌరవాన్ని కలిగించే కొత్త మూర్తి.

"ఆగు" వెళ్ళబోతున్న అతడిని ఆజ్ఞాపించాడు— "అలా వొక్కక్షణం మాట్లాడకుండా నిల్చో. మా మాటల్లో జోక్యం కలుగజేసుకొన్నావో...." ఆ మాటల్ని అన్న తీరు చూచాక ఎవరికీ ఆ ధైర్యం వుండదు.

నమశ్శివాయ కొడుకును వదిలేసి వేదవ్యాస్ వైపు తిరిగేడు.

"నాయనా. యిక నీదే ఆలస్యం. అమ్మాయికి ఆ పారిపోయిన కుక్కలంటే యిష్టంలేదు. నిన్ను చేసుకొంటానంది."

"కాని నేను...."

"నీకు అమ్మాయంటే యిష్టమని నాకు తెల్సు. అమ్మాయి కూడా చెప్పింది"-కామాక్షమ్మగారంది.

"ఏమని?"

"నీకు అమ్మాయంటే యిష్టమని. ప్రాణం యిస్తావని."

"కాని ఆమెకు నేనంటే...."

"చిన్నచూపు. అసహ్యం అని విన్నాను. కాని అది గతం. ఆ గతం నాలాగే చచ్చిపోయింది. యిప్పుడు నిన్ను చేసుకోటానికి ఎగిరి గంతేసి అంగీకరించింది చిత్ర—"

"నా కాక్కా_స్త వ్యవధి యివ్వలేరూ?"

"యివ్వననటం నేరం. కాని నువ్వొదక్కపోతే సంతోషిస్తా. యీ ముహూర్తానికే యీ పెళ్ళి జరిగిపోతే నాకు తృప్తి. చిత్రకు తృప్తి. అందరికీ ఆనందం."

"కాని యిది ఆవేశంలో తీసుకొన్న నిర్ణయం...."

"కావచ్చు. అయినా అనర్థాలకి దారి తియ్యదని అభయం యిస్తున్నా!"

వేదవ్యాస్ ఆలోచనలు స్తంభించిపోయాయి. మానసిక చైతన్యాన్ని కోల్పోయాడు. ఊహించని పరిణామం. ఎటు పోతుందో! దేనికి దారి తీస్తుందో!!

"నా బాధ నీదన్నావు? నా పరువు నీదన్నావు. నేనింతవరకు జీవితంలో ఒకరి కిచ్చానేతప్ప ఎవర్ని ఏమీ యాచించలేదు. కాని నిన్ను....చిన్నవాడివైనా నిన్ను ఈనాడు 'దేహీ' అని యాచిస్తున్నాను. నీ కాళ్ళు కడిగి కన్యాదానం చేసే అదృష్టాన్ని నాకివ్వు నాయనా"

నమశ్శివాయ వుపయోగించిన ఈ చివరి అస్త్రం వేదవ్యాస్ మీద అమోఘంగా పనిచేసింది.

"అంతమాటనకండి బాబుగారూ! మీ యిష్టప్రకారమే కానివ్వండి" అనేసేడు చటుక్కున.

# 14

ఓంనమశ్శివాయ చెప్పింది వింటూనే సూరిశాస్త్రికి మూర్ఛ వచ్చినంత పని కాలేదు. భార్యవైపు ఆలోచనగా చూచాడు. ఆమె పేరు కా?

కాంబ, ఆమె కొడుకువైపు చూచింది. అతను తల వంచుకున్నాడు.

కాళికాంబ పేరును చూచి భయపడాల్సినంత వ్యక్తికాదు. ఆమె చాలా నెమ్మదస్తురాలు, భర్తకుమించి ఆలోచించగల సమర్థవంతురాలు. అవసరమైనప్పుడు మొహమాటాలకి పోకుండా మనసులో మాట నిర్మొహమాటంగా అనగల ధైర్యం వుంది.

"మరీ యింత గొంతుమీద అడకత్తెరలా వస్తే ఎలాగండి అన్నయ్యగారూ! ఎంతైనా తలిదండ్రులం. మా బిడ్డ బాగోగులు మేం కూడా ఆలోచించుకోవాలా?"

"ఆలోచించుకోవాలమ్మా! పరిస్థితులిలా వచ్చాయి కానీ...."

పరిస్థితులెలా వచ్చింది సూరిశాస్త్రి రాగానే కాళికాంబకు చెప్పనే చెప్పేడు.

ఆడంబరాలు తప్ప అక్కడ అందరనుకొన్నంత ఆస్తీ లేదు, గొప్పాలేదు. పైగా పిల్ల పొగరుమోతు. గర్విష్ఠి. పీటలమీద పెళ్ళి ఆగిపోయింది. ఆ అప్రదిష్టను కొంగున మూటగట్టుకొని వుంది.... కూతురికి పెళ్ళికాదని నమ్మళ్ళవాయకు తెల్సు. వేడితగ్గితే వేదవ్యాస్ కూడా కాదనవచ్చు. అందుకని ఈ ఎత్తు వేశాడు.

కాగా తమ కొడుక్కేం తక్కువ? పుట్టినదగ్గర్నుంచి మహారాజే వాడు. చదువులో, అందంలో, గుణంలో....పైగా యిపుడు వాడు రెండు లక్షలకు అధికారి. అదృష్టం వాడిని వరించి వచ్చింది. యింతకు వెయ్యింతలు గొప్ప సంబంధాలు వాడిని వెతుక్కుంటూ వాళ్ళ దగ్గరకొస్తాయి. వాడిది మహారాజ జాతకం.

కొడుకును లోపలికి తీసికెళ్ళి మంతనాలు చేశారు. యీ హడావుడి పెళ్ళి తమకు యిష్టం లేదన్నారు. మనసులో ఆలోచనలన్నీ అటినికి నూరిపోసేరు.

కని,పెంచిన తలిదండ్రులు,వాళ్ళ ఆశలు, కోరికలు ఒకవైపు-

తిండి తిన్నానన్న విశ్వాసం, మాటకు కట్టుబడాలన్న నీతి మరో వైపు—

"అమ్మా మీ రక్తంలోనుంచి పుట్టేన్నేను. కాని యీ రక్తాన్ని వాళ్ళు పెంచారమ్మా. వృద్ధిచేశారు. పదేళ్ళకు పైగా వాళ్ళ పంచన పడివున్నాను."

"ఆ కృతజ్ఞత వుండాల్సిందేరా అబ్బీ! మా కా విశ్వాసం లేదనుకోకు. కాని అది తీర్చుకోవటానికి రొచ్చుగుంటలో దిగనక్కర లేదు. డబ్బివ్వు. చాకిరీ చేయి. మరేదన్నా మాట సహాయం చెయ్యి. కాని అక్కడ ఏముందని యీ అర్ధాంతరపు పెళ్ళికి అంగీకరించాలి మేము? ఎంత బీదవాళ్ళమైనా. పదిమంది పిల్లలు గలవాళ్ళమైనా. మాకూ నీ పెళ్ళి ముద్దుముచ్చట్లు చూచుకోవాలని వుండదుట్రా?"

"క్షమించమ్మా. మాట యిచ్చాను. వెనక్కిపోవటం మర్యాద కాదు."

"ఆస్తి వచ్చింది కదా అని సమయంచూచి. నిన్నొంటరిచేసి నీచేత మాట లిప్పించుకోటం మర్యాదేం?....ఆ రెండు లక్షలే రాక పోతే నిన్ను అల్లుడివి చేసుకోటానికి అంగీకరించేదా ఆ పిల్ల? ఆ ముసిలి నక్కజిత్తుల ప్లీడరుమాత్రం వొప్పుకొనేవాడా?"

"అయితే వినమ్మా. ఈ రెండు లక్షల ఆస్తి నాది కాదు. నా వాళ్ళకోసం ఖర్చు పెట్టను. ఏదన్నా స్కూలుకో. హాస్టలుకో ఏకా శంగా యిస్తాను. ఆ డబ్బుమీద మీరే ఆశలూ పెట్టుకోకండి. ఆయన్తో కూడా చెప్తాను. అందుకాయన అంగీకరిస్తేనే ఈ పెళ్ళి. లేదా మీ యిష్టప్రకారం జరిపించండి."

ముగ్గురూ బయటకొచ్చేరు. లోపల కట్నాల గురించే చర్చ అని వూహించాడు నమశ్శివాయ. అడక్కముందే చెప్పేయాలను కొన్నాడు.

"శాస్త్రిగారూ. మరొక్కమాట. నా అల్లుడికి నేనేం లక్ష్యువ చేయను. అవతల అనుకొన్నట్లే అబ్బాయికి జరిపిస్తాను." అన్నాడు.

అవన్నీ జరిపించే తాహతుంటే ఆ పెళ్ళే జరక్కపోయిందీ అనుకొన్నారు యిద్దరూ.

నమశ్శివాయ మళ్ళీ అందుకున్నాడు "కాని ఇప్పటి నా పరి స్థితి మీకు తెల్సు. కాలం ఎప్పుడూ యిలాగే వుంటుందా? ఈ అమ్మ కాల మీద ఆంక్ష పోయాక...."

"కట్నం నా కక్కర్లేదు బాబుగారూ! కష్టపడకుండా వచ్చే ధనాన్ని నేనాశించను. అందుకే నాకు లాటరీలో వచ్చిన ధనాన్ని

విరాళంగా యిచ్చేయాలని నిర్ణయించుకొన్నాను. ఇందుకు మీకు అభ్యం తరం లేదుగా?"

"అభ్యంతరమా దానం చేస్తానంటే! నోనో. కాగా నీ ఔదార్యానికి మనసులో పొంగిపోతున్నా. లక్షల్ని చూచి నీకు నా బిడ్డ నివ్వడం లేదు. మూడు మంచి గుణాలని చూచి యిస్తున్నా"

"చిత్రప్రియకూ_డా ముందే చెప్పండి."

"అలాగే–"

# 15

క్షణంలో పందిరి కన్నీళ్ళు తుడుచుకొని ముస్తాబు చేసుకొంది. పెళ పెళా నవ్వింది. ముహూర్తంవేళకి వూరంతా చేరింది. పెళ్ళి కొడుకు వేదవ్యాస్ అని తెల్సేసరికి కాలేజీ తరలివచ్చింది.

దసరాబుల్లోడులా డ్రస్ చేసుకొని వచ్చాడు శ్రీమహావిష్ణువు అతని దృష్టి పీటలమీద కూర్చున్న చిత్రప్రియమీదే వుంది. ఎంత అందం? వాట్ ఎ బ్యూటీ! తలెత్తితే కళ్ళల్లోకి చూచి మాట్లాడదామని అతని కోరిక. కాని దించిన తల ఎత్తలేదు చిత్రప్రియ.

వేదవ్యాస్ చిత్రప్రియ భర్త—

చిత్రప్రియ వేదవ్యాస్‌ను చేసుకొంటోంది—

వాళ్ళిద్దర్ని తెల్సినవాళ్ళకి ఈ భావన చేదుగా వుంది. అపశృతిలా విన్పించుతోంది. అయినా అది కళ్ళ ఎదుట కన్పిస్తున్న సత్యం.

సాగర్ దూరంగా కూర్చొని వేదవ్యాస్‌వైపే చూస్తున్నాడు. అతని మెదడులో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి. మనసు లావాలా వుడుకుతోంది.

ముహూర్తం వేళకు చిత్రప్రియ మెళ్ళో వేదవ్యాస్ మంగళ సూత్రం బిగించాడు. పెద్దలు, పిన్నలు అందరూ యిద్దరి నెత్తిన అక్షింతలు చల్లేరు.

ముడివేస్తున్న సమయంలో చిత్రప్రియ తలెత్తి వేదవ్యాస్ కళ్ళల్లోకి చూచింది.

వేదవ్యాస్ వులిక్కిపడ్డాడు. ఏదో కీడు శంకించి భయపడ్డాడు. పెళ్ళి జరిగిపోయింది. పాలపొంగు తగ్గింది కాస్త.

అందరూ వెళ్ళేక వ్యాస్ సాగర్ దగ్గరికెళ్ళాడు. తనే పలకరించాడు. అంతవరకు అణుచుకొన్న భావాలు సాగర్‌లో ఒక్కసారి ప్రవ్వెత్తుగా లేచాయి.

"నీ దాంపత్య జీవితం సుఖంగా వుండాలని ఆ భగవంతుడిని ప్రార్థిస్తాను ఎప్పుడూ....ఎల్లప్పుడూ" అతికష్టంమీద అతని నోటినుండి మాటలు వెలువడ్డాయి. నిలవలేనట్లు వెళ్ళిపోయాడు.

లోపలకెళ్ళగానే చిత్రప్రియ వేసిన మొదటి ప్రశ్న—

"ఏమిటి వాడేదో మూరిపోస్తున్నాడు?"

"ఎవరు?"

"అదే ఆ చిచ్చుబుడ్డిగాడు"

బుడ్డిచెంబు గాడని తనని అన్నట్లే అనిపించింది వేదవ్యాస్‌కు.

"సాగర్ సంగతేనా నువ్వంటోంది?"

"అవును. వాడేంచెప్పినా నేను కేర్‌చేయను. కాని వాడితో నువ్వింక మాట్లాడటానికి వీల్లేదు"

"ఏం? వాడు నా స్నేహితుడు"

"నా మెళ్ళో అంత గర్వంగా తాళికట్టేవు. మర్చిపోయావా?— నేనిప్పుడు నీ భార్యను"

"అయితే?"

"నేను చెప్పినట్లు నువ్వు వినాలి. ఆ చిచ్చుబుడ్డిగాడు కావాలో, నేను కావాలో నిర్ణయించుకో"

"యిద్దరూ కావాలనుకోటం తప్పా?"

'అసంభవం. ఐ హేట్ దట్ ఫూల్ - ఇడియట్ - రోగ్...."

మాటలు పెంచటం మంచిదనిపించలేదు.

"సరే సరే. నువ్వులోపలికెళ్ళి విశ్రాంతి తీసుకో"

ఆమె అతని కళ్ళల్లోకి సూటిగా చూచింది, అదే చూపు.... అదే చూపు— ఆ చూపుల్లో ఏదో మంట-!

"మెళ్ళో మూడుముళ్ళు వేయగానే అధికారం వచ్చిందను

కొంటున్నావేంటి? నువ్వు అంటున్నావు? లోపలకెళ్ళమని శాసిస్తు న్నావే!"

"శాసించటంలేదు ప్రియా. అర్థిస్తున్నాను"

"స్టాపిట్. మళ్ళీ నన్నలా పిలిస్తే....నో....నన్నలా పిల వ్వొద్దు. ఐ హేట్ యిట్. ఐ హేట్ యు—"

సాగర్ మాటలకు అర్థం బోధపడ సాగింది వేదవ్యాస్‌కు.

# 16

వేదవ్యాస్ దాంపత్య జీవితంలో వో పేజీ తిరిగింది.

తెల్లవారింది. సుధాకర్ పేపరు పట్టుకొని అతని ముందు మాకేడు.

"రెండు లక్షల బావగారూ. మీకు వచ్చిన రెండులక్షలు యివాళ వెనక్కిపోయాయి. నిన్న ప్రకటించిన నెంబర్లో చివరి అంకె తప్పు పడిందట. సవరణ యిదిగో" వేదవ్యాస్ చూచి చింతించలేదు.

"అయినా ఆ నెంబరు మీ విద్యాసాగర్‌దేటగా?"

"అవును. యిద్దరి టిక్కెట్లు నెంబర్లు వరుసే."

సుధాకర్ వదిలేసిన అయిదు నిముషాలకు చిత్రప్రియ వచ్చింది.

"లక్షాధికారి బిక్షాధికారయ్యేట్ట?"

..........

"అయినా మన మొహానికి అంత అదృష్టం కూడానా?.... ఆ చిచ్చుబుడ్డిగాడిక చిటపటలాడుతాడు కాబోలు! అసలు యిదంతా నన్ను చేసుకోటానికి ఆడిన నాటకం కాదుకదా?"

............

"ఏం? మాట్లాడవే?"

"ఏం మాట్లాడను?"

"నన్నెందుకు మోసం చేశావ్?"

"అయితే నా లక్షల్నిచూపి నన్ను చేసుకొన్నావా?"

"కాక? నీ అందాన్ని, అంతస్థుని, గొప్పతనాన్ని చూచను కొన్నావా?"

"ఎందుకో నీకే తెలియాలి. కాని ఆ రెండు లక్షలు నావే అయినా అందులో వొక్కకానీ నా స్వంతానికి ఖర్చుపెట్టనని అప్పుడే మీ నాన్నకు, అన్నయ్యకూడా చెప్పేను."

"నాతో చెప్పేవా?"

"నువ్వడిగావా?"

"బోడిడబ్బు, ముష్టిరెండు లక్షలు నీకు రాగానే మురిసిపోయి చేసుకొన్నాననుకొన్నావా? ఐ హేట్ యు—"

"ప్లీజ్, వాదన పెంచుకొంటూపోతే అంతం అంటూ వుండదు. మంచో చెడో మన చెంగులు ముడిపడ్డాయి, మనసులు కూడా ముడి వేద్దాం."

"నేను చిత్రప్రియను. నాకు ధనముంది; అందం వుంది. నీకు? నువ్వు బెగ్గర్‌వి...."

"చిత్రా...." వ్యాస్ కోపంగా అరిచాడు. అంతలోనే అతని పెదవులు ముడి పడ్డాయి.

"నిజమే చిత్రా! నేను బెగ్గర్‌ని. ఆనాడు మీ నాన్నని అన్నం యాచించాను. అందుకు ప్రతిఫలంగా తన పరువు నిలపమని యాచించాడు. మన పెళ్ళయింది. ఈనాడు నిన్ను రెండు చేతులు ఎత్తి అర్థిస్తున్నాను. మన పెళ్ళయి యిరవై నాలుగు గంటలు కాకముందే, నీ కాళ్ళపారాణి ఆరకముందే మన జీవితాల్లో ప్రళయాన్ని సృష్టించకు. మన దాంపత్య జీవితంలో దావానలం రేపకు."

"నా కాళ్ళపారాణి యివాళ కాకపోతే రేపు ఆరుతుంది. కాని నా మనసులో మండే మంట ఆరదు."

"ఎందుకు మంట? ఎవరిమీద ఆ కసి? నేను నీకేమన్నా అప కారం చేశానా? ఎన్నడన్నా అగౌరవపర్చానా? ఎందుకీ అకారణమైన అసహ్యం, కోపం?"

# 17

చిత్రప్రియ మూడు నిద్దర్లకి అత్తవారింటికెళ్ళనని మారాంచేసింది.

"యిదేం చోద్యమమ్మా?" అని ముక్కుమీద వేలేసుకొన్నారు విన్నవాళ్ళు.

"నేనప్పుడే భయపడ్డాను యిలాంటి విపరీతాలు జరుగుతాయని. నేతులు తాగిన తాతలున్న వాళ్లు వాళ్ళు. యిలాటి వాడే ఎవడో అడుక్కోడానికి బంగారు బొచ్చె కావలన్నాట్ట. అన్నీ పోయినా అహంకారాలు, దర్జాలు పోలేదు. మా బీదకొంప కొస్తుందా ఆ రాణి?" కాళికాంబ మనసులోనే గొణుక్కొంది.

విషయం తెల్సి నమఃశ్శివాయ కూతురు దగ్గరికి పరుగెత్తాడు.

"నేను బెగ్గర్ హోంకి వెళ్ళలేను డాడీ"

"బెగ్గర్ హోం! అత్తవారిల్లు బెగ్గర్ హోమా నీకు!!"

"అతనెలాగూ మనింట్లో పడివుండేవాడుగా మొన్నటిదాకా! యిప్పుడూ అలాగే వుంటాడు. నే నెందుకు ఆ యింటికి?"

"అంటే—అతను నీ దృష్టిలో...." నమఃశ్శివాయ క్కోపం వొచ్చింది? కోపాన్ని అణచుకొంటూ గంభీరంగా అన్నాడు. "నో....చిత్రా. యిలాంటి వ్యవహారాలు నేనిక సహించను. అతను నీ భర్త. యీ యింట్లో నీకిక చోటులేదు. అత్తగారింటికెళ్ళి తీరాలి."

"అత్తగారింటిక్కాదు. గోదావరి గర్భంలోకి వెళ్తాను."

"చిత్రా...."

"అరవటం అనవసరం డాడీ! నాకు పెళ్ళయింది. నీ బాధ్యత తీరిపోయింది. నీ యింట్లో చోటు లేదు. యిక నే నెటుపోతే నీకేం?"

చిత్రప్రియ వెక్కి వెక్కి ఏడుస్తుంటే నమఃశ్శివాయ కఠినత్వం కరిగిపోయింది.

"అసలేమయిందమ్మా? అతనికేం తక్కువ? ఎందుకింకా

అతన్ని అసహ్యించుకొంటావ్! నా తల్లివి కాదూ. నీ సుఖం కోరి చేసిన పెళ్ళి. నిండు జీవితాన్ని నిప్పులపాలు చేసుకోకు. యీ మూడు రోజులు అత్తవారింటికెళ్ళి రా. అంతగా అయితే ఆ తర్వాత సంగతి అతనితో మాట్లాడుతాను."

"సరే డాడీ. వెళ్తాను. మీ కోసం—మీ లోకం కోసం మూడు రోజులు ఆ నరక కూపంలో, మడ్డి మనుష్యులమధ్య మూడు రోజులు ముక్కు మూసుకు గడిపేస్తా. కాని ఆ యింటి గడప తొక్కటం యిదే మొదటిసారి, ఇదే ఆఖరిసారి కూడా."

అత్తగారింట్లో అడుగు పెడ్తూనే ఆశ్చర్యపోయింది చిత్ర ప్రియ!

ఆ యిల్లు, అక్కడి వాతావరణం, మనుష్యులు ఆమె అనుకొన్నంత హీనంగా లేరు. ఉన్నంతలో అంతా శుభ్రంగా వుంది.

అయినా ఆ మూడు రోజులు కొత్త అల్లుడికన్నా ఎక్కువగా అత్త మామల్ని, ఆడబిడ్డల్ని సతాయించింది. ఎత్తిపొడుపులు పొడుస్తూనే వుంది.

తనూ నోరు తెరిస్తే కొడుకెక్కడ బాధపడిపోతాడేమోనని కాళికాంబ నోరు మూసుకొనేవుంది. కాని ఎంతసేపు?....

మూడో రోజు ఆమె నోరు విప్పింది. ఆమె నోరు విప్పితే ఆ ధాటికి ఎవరూ ఆగలేరు. చిత్రప్రియను, నసుళ్ళాయను, అటు ఏడు యిటు ఏడు తరాల వాళ్ళని కడిగిపారేసింది. చిత్ర ప్రియను ఎంగిలాకని, కుక్క ముట్టిన నైవేద్యం అని దెప్పింది.

చిత్రప్రియ అత్తగారి ధాటికి ఆగలేక పోయింది. కాగా భయ మేసింది.

మూడు నిద్రల మూడు రోజులూ ఎవరికీ నిద్రలేదు. మూడు యుగాలు; మూడు శివరాత్రులు!

పెళ్ళి బృందం గడప దాటగానే తలుపులు ఛళ్ళన మూసేసి "ఛీ. పీడవదిలింది. పెళ్ళిట పెళ్ళి. అచ్చటా, ముచ్చటా? బజారున పోయే శనేశ్వరాన్ని యింట్లోకి తెచ్చుకొన్నాం, ఖర్మ" అనుకొంటున్న తల్లి మాటల్ని విన్నాడు వేదవ్యాస్.

వెళ్ళి ఆమె పాదాలు పట్టుకొన్నాడు- 'నిజమేనమ్మా. మిమ్మల్ని

నిరాశ పర్చాను. నన్ను నేను అన్యాయం చేసుకొన్నాను. దారుణంగా మోసపోయానమ్మా. క్షమించు'

కాళ్ళమీద కొడుకు కన్నీటిబొట్లు రాలగానే ఆ తల్లి హృదయం కరిగి పోయింది. 'నా తండ్రీ. వందేళ్ళ జీవితాన్ని నిమిషంలో నాశనం చేసుకొన్నావు గదురా' అంటూ కొడుకును గుండెలకు హత్తుకొంది.

# 18

మరుసటి వారం కాలేజీకి కెళ్ళాడు వ్యాస్. సాగర్‌తో మనసువిప్పి మాట్లాడేక అతనికి అన్ని విషయాలు బోధ పడ్డాయి.

యిద్దరూ కల్సి వో నిర్ణయానికొచ్చారు. గతాన్ని మర్చిపోవాలి. పరీక్షలు దగ్గరకొచ్చాయి. గట్టిగా చదవాలి.

కాని పదిరోజులన్నా యిలా గడవక ముందే నమశ్శివాయ పదహారు రోజుల పండుగకు రమ్మనమని కబురుపంపాడు

యీ పదిరోజుల్లో చిత్రప్రియ కాలేజీకి రావటంలేదని గ్రహించాడు. ఇంట్లో తర్జన - భర్జనలయ్యాక అత్తగారింటికి వొంటరిగానే వెళ్ళాడు వేదవ్యాస్

పదిరోజుల్లో ఆ యింట్లో ఎంత మార్పు!!!

యిప్పుడా యిల్లు సత్రం కాదు; దిక్కులేని దివాణం కాదు. అన్నిటా నమశ్శివాయ కలిగించుకొంటున్నాడు! ఖర్చు చూచిచూచి చేస్తున్నారు. అంతా నమశ్శివాయను చూచి భయపడ్తున్నారు. అందరి ప్రవర్తనల్లో ఏదో సహజత్వం....

సాయంత్రందాకా ఏ సంఘటన ల్లేకుండా గడచిపోయినందుకు సంతోషించాడు వ్యాస్. తెల్లవారితే తనదోవన తను వెళ్ళవచ్చు.

భోజనాల దగ్గర అతని ప్రక్కనే కూర్చుంది చిత్రప్రియ. కాని సాయంకాలం కొత్త బట్టలు అతనికిస్తుంటే ఆమె దూరంగా చూస్తూ కూర్చుంది. ఆ చూపు....అదే చూపు....!

"నాయనా! పెళ్ళయింది. యీ పదహారు రోజుల పండుగనే ఆ కార్యం కాస్తా ముగించేసి నా బరువు పూర్తిగా వదిలించుకొందా

మనుకొన్నాను. కాని పరిస్థితులు అనుకూలించలేదు. త్వరలో ఆ కాస్త కార్యం కూడా అయిపోతే...." అంటూ అసలు విషయం కదలేశాడు నమశ్శివాయ.

వ్యాస్ చిత్రప్రియవైపు చూశాడు. అదే చూపు....!అదే చూపు....!

"పరీక్షలు దగ్గరికొచ్చాయండీ. తనకీ పరీక్షలున్నాయికదా! జీవితంలో సెటిల్ కానివ్వండి ముందు."

"చిత్ర మరి చదవనంటోంది. నేనూ పట్టుబట్టటం లేదు. చదివి ఏం చేయాలి?"

"అదేం మాట? ఏదో చేస్తేనేనా చదువు? ఎలాగూ పరీక్షలు దగ్గరికొచ్చాయికదా! మరో రెండు నెలలు - డిగ్రీ చేతికొస్తుంది. ఇప్పుడు ఆపటం ఎందుకూ?"

అప్పటికలా అయిపోయిందా సంభాషణ. కాని ఆ రాత్రి చిత్రప్రియ వ్యాస్ గదిలోకి మంటలా వచ్చింది.

"మెళ్ళో ఆ నారపీచు కట్టగానే మొగుడినైపోయాననుకొంటున్నావేంటి!"

"నువ్వనుకోటం లేదా?"

"నా చదువు సంగతి నీకెందుకు? ఆ డిగ్రీ చేతికొస్తే ఉద్యోగం చేయిద్దామనా?"

"ఆ అవసరం నీకు కలిగినప్పుడు వుపయోగపడుతుందనే"

"నీ మాత్రం తెలివితేటలు ఎవరికీ లేవనా నీ వుద్దేశ్యం? సమాధానా లడుగుతుంటే తెలివిగా ప్రశ్నలు వేస్తావ్? సూటిగా జవాబివ్వటం నేర్చుకో!"

"నువ్వు ఆలోచించి మాట్లాడటం నేర్చుకోమని నేనంటే?"

"అంటే నేనాలోచించననా నీ వుద్దేశ్యం?"

"చూడు చిత్రప్రియా, మనం అనవసరంగా ఘర్షణ పడవద్దు. అందరిలో లోకువ కావద్దు. నువ్వు భార్యవి కాకపోయినా ఏ మాత్రం అవకాశమున్నా, చదువు ఆపవద్దనే సలహా యిచ్చి వుండేవాడిని_"

"నిన్ను చదువు మానేసి పెళ్ళాంతో కాపురం పెట్టమని నేను సలహా యిస్తున్నా. నా సలహా పాటిస్తావా మరి?"

"…… …… ……"

"నువ్వు మొగాడివి. నువ్వెందుకు పెళ్ళాం సలహా మన్నిస్తావ్? మూడుముళ్ళూ వేసినందుకు నీవు చెప్పినట్లు నేను వినాలి. అంతేనా?"

"వినకు. నేను బలవంతం చేశానా?"

"నువ్వు చేయకపోతేనేం? నీ కోరికల్ని తీర్చే నీ ఏజంట్లు ఈ యింట్లో వున్నారుగా! వాళ్ళు నా మెడలు వంచుతారని నీకు తెల్సు. అయినా నిన్ను పెళ్ళి చేసుకొని కాలేజీకొచ్చి అందరి మొహం ఎలా చూడగలననుకున్నావ్? నా తల భూమిలోకి కూరుకుపోతుంటే చూచి ఆనందిద్దామనేకదూ నన్ను కాలేజీకి రమ్మనటం?"

"నా పట్ల నీ హృదయం ఎందుకంత విషభరితమయిందో నాకు తెలియదు చిత్రా! ఆ విషానికి విరుగుడుందో లేదో కాని దయచేసి లేనివన్నీ వూహించుకొని అసహ్యాన్ని పెంచుకోకు. నీకీ పెళ్ళి యిష్టం లేకపోతే విడిపోదాం."

"విడిపోదామా? అంటే.... అంటే.... విడాకులిచ్చి నన్ను నలుగురిలో మరీ నగుబాట్లు చేద్దామని నీ ఉద్దేశ్యంఅన్నమాట. కాని నిన్ను నేను చేసుకొంది అందుక్కాదు."

"ఎందుకు?"

"ఎందుకా?" చిత్రప్రియ అసహ్యంగా నవ్వింది. "యింకా అర్థంకాలేదూ? అవుస్లే మట్టిబుర్ర మరి!"

నమాధానం యివ్వకుండానే వెళ్ళిపోయింది.

# 19

పదిహేనురోజుల్లో నమశ్శివాయ యింట్లో వచ్చిన మార్పులు నమ్మలేనివి. మొదట్లో వూళ్ళోవాళ్ళు నమ్మలేదుకూడా. కాని క్రమంగా ఆయన ఆస్తంతా హరించిందనీ. దంబాలు తగ్గేయన్న సత్యాన్ని వూరంతా నమ్మక తప్పలేదు.

నమ్మేక వూళ్ళో కొట్లవాళ్ళు ఆయన పద్దుల్ని లెక్కచూచారు మరి అప్పులియ్యటం మానేశారు. అప్పులు తీర్చమని ఆయన్ని నిలేయ సాగేరు.

నమశ్శివాయ స్థితితోపాటు చౌదరి ప్రణాళికకూడా తల్లకిందు లయింది. ఇంతవరకు చురుకైన కుర్రాడుగా ఆయన కళ్ళకగ్పిపిం చిన సుధాకర్ నాటకాలంటూ తిరిగే "జులాయి వెధవ"లా కన్పిం చాడు. యీ మధ్య యింటికి అతని రాకపోకలెక్కువయ్యాయి. తగ్గించాలి అనుకున్నాడు.

సరిగ్గా అతనలా అనుకొన్న క్షణంలోనే సుధాకర్ మంజుల ముందు కూర్చొని ఆ పిల్లి మొహాన్ని చూస్తూ సినిమా తియ్యాలనే దృఢనిశ్చయాని కొచ్చాడు.

ఈ పదిహేను రోజులు తండ్రిని చూసి భయపడ్డాడు. దూర దూరంగా తిరిగేడు.

వానపాము విషనాగుగా మారితే కలిగే భయం అది. ఆ భయంలో దిగ్భ్రమ వుంది. ఆ దిగ్భ్రమ పోయింది యిప్పుడు. పామును పాముగానే చూట్టానికి అలవాటు పడ్డాడు. ఆ పామును కొట్టడానికి కర్రలున్నాయి. ఆ కర్రల్ని వుపయోగించే ధైర్యం వచ్చింది.

"సినిమా తీస్తా మంజూ. జయభాదురిని మించిన నటిని చేస్తా నిన్ను."

"పెళ్ళి....నాన్న....?"

పెళ్ళి చేసుకొంటానని చౌదరిని అడగమని ఎన్నోసార్లు చెప్పింది. కాని సుధాకర్ ఆలోచన వేరు. రౌడీ ప్లీడరుకు అల్లుడయితే ఆయన బంధిఖానాలో బిగిస్తాడు. ఎవరికీ అందకుండా, అందరికీ దూరంగా, మంజులతో కల్సి వెళ్ళాలని అతని కోరిక.

"మీ నాన్ననడిగి లాభం లేదు మంజూ. మన పెళ్ళికంగీక రించడు. ప్రణాళికలు సాగవు"

"అంగీకరిస్తాడు సుధాకర్. అడిగిచూడు—"

సినిమాలో విలన్‌లా అకస్మాత్తుగా చౌదరి వాళ్ళముందుకు వచ్చాడు.

"అంగీకరించనమ్మాయ్. పెళ్ళికే కాదు. వీడిక ఈ యింటికి రావటానిక్కూడా అంగీకరించను. వీడింతవరకు వచ్చినందుకే మన పరువెంతో పోయింది."

"నాన్నగారూ... !"

"అవునమ్మాయ్! వాడికేముంది చెప్పు? చదువు లేదు. బి. ఎ. చేతిలోనే మెత్తగా వోడిపోయిన మొగాడు. యిక డబ్బు? వీడినెత్తిన వీడి తండ్రినెత్తిన ఏగాణి పెట్టినా దమ్మిడీ ఖరీదు చేయరు. పైగా జులాయి వెధవ, నాటకాలంటూ తిరుగుతాడు. జీవితంలో ఎవరినన్నా నమ్మొచ్చుకాని యీ నాటకాల వెధవల్ని మాత్రం- అవసరమైతే అద నపు కాఫీ కోసం, అరడుగుమందాన మొహాన రంగు పూసుకోటం కోసం పెళ్ళాం బిడ్డల్నే తాకట్టు పెట్తారు."

"సార్. మీరు పొరపాటు పడ్తున్నారు"

"కాదు. యింతవరను పడ్డాను. అందుకే నా యింటికి రానిచ్చాను. నా కూతుర్తో ఏకాంతంగా మాట్లాడనిచ్చాను. మరి నాలుగు రోజులిలాగే సాగనిస్తే నా యింటికి, నా ఆస్తికి, నాకే ఎసరు పెట్తావ్ నువ్వు. కనుక—ఔట్ ... గెటవుట్ ...."

చేతికి చిక్కిన ఆ బంగారు కొమ్మ కాస్తా అలా విరిగి పడి పోవటంతో సుధాకర్‌కి వెర్రెక్కింది, కల్లు తాగిన కోతిలా గంతు లేస్తూ యింటి కొచ్చాడు. నేరుగా తండ్రి గదిలోకి వెళ్ళలేదు. ఒక అన్న గదిలోకి వెళ్ళేడు.

మరో నిముషంలో ఆ లంకంత యింట్లో వో మూల గదిలో నిప్పురవ్వ పడింది, అది యిల్లంతా పాకింది. గంటలో ఆ నిప్పురవ్వ మంటగా మారి యింటి మధ్యలోవున్న నమశ్శివాయ గది దగ్గర కొచ్చింది,

అయిదుగురు కొడుకులూ వొక్కుమ్మడిగా తన గదిలోకి తోసుకురావటంతోటే అంతా అర్థమయింది నమశ్శివాయకు. పుత్రులు శత్రువులుగా మారారు. వొక్కపైె దండయాత్ర చేస్తున్నారు.

"ఏమిటి!" అన్నట్లు చూచాడు.

"ఆస్తి మీ చేతుల్లోనేవుంటే మా చేతికి రాగిచెంబు వస్తుంది. ఆస్తి పంచండి."

"పంచితే వచ్చేది పూచిక పుల్లలని పూర్వమే చెప్పేను."

"దర్శపాచలకన్నా నయం కదూ! ఆ పుల్లలే యివ్వండి."

"వారేయ్ నా మాట వినండి. నేను కళ్ళు మూసుకొని పొరపాటు చేశాను. మీకు అన్యాయమే చేశాను. కాని ఆ పొరపాటును యిప్పుడు దిద్దుకొందామనుకొంటున్నా. మీకు వున్నంతలో న్యాయమే చేసి తండ్రిగా నా బాధ్యతను కొంతైనా నెరవేర్చాలనుకొంటున్నా. ఆ అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకోకండి."

"అవును. ఈ అవకాశాన్ని జారవిడుచుకోం. తెర్చిన కళ్ళు మళ్ళీ మూసుకోము. పంచండి ముందు."

"ఒరేయ్ సుధాకరమ్! నీ సినిమా తపనతో మన సంసారాన్ని వో సినిమా కథ చెయ్యకు. ఈ గుప్పెట చూచావా? మూసి వుంచేనే దాని దాపరికం. తెరిస్తే?.... ఏమీ లేదు. యిప్పుడు మన స్థితి అదే. అర్థం చేసుకో."

"పంచు పంచు" అన్న పదాన్ని తప్ప మరేమీ అర్థం చేసుకో లేదు కొడుకులు. ఒంటరిగా యుద్ధమే చేశాడు నమశ్శివాయ. కాని చివరికి ఓడిపోక తప్పలేదు.

గుప్పెట విప్పేడు. గూడు చీలింది. భూములు తునక లయ్యాయి.

ఆయనన్నట్లు పూచికపుల్లలు రాలేదు కొడుకులకి.

సుధాకర్‌కి సినిమా తియ్యటానికి సరిపడే ఆస్తి వచ్చింది. ఆందుకతను మురిసిపోయ్యాడు. అబద్ధం చెప్పేడని తండ్రిమీద ఎగిరి పడాడు. కాని ఆయన ఖర్చుపెట్టిన దానితో పోలిస్తే తన కొచ్చింది పూచిక పుల్లేనని అతనికి తోచలేదు!

# 20

లంకంత కొంప రైలుపెట్టెలుగా మారింది. తండ్రికన్నా చెప్పకుండా తన రైలుపెట్టెను వారం తిరక్కముందే అమ్మేశాడు సుధాకరం.

యింటికి బేరం కుదిరిన దగ్గర్నుంచి సుధాకర్ మంజులను

ఒక్కసారి కలవటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. లాభంలేక పోయింది. వో వుత్తరం మాత్రం ఆమెకు చేర్చగలిగాడు.

ఆ వుత్తరంలో మద్రాసు వెళ్ళటానికి ముహూర్తం రాశాడు. ఆ వేళకి రాజమండ్రి స్టేషను దగ్గరకెలాగైనా రావల్సిందిగా కోరేడు.

రాజమండ్రి స్టేషనుకు మద్రాసు మైలు సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో వస్తుంది. పట్టపగలు! ఆ బంగారు పంజరంలో నుంచి చిలుక ఎగిరి రాగలదా? ఆ రాక్షసుడి కళ్ళుబడదుకదా!

స్టేషనులో అసహనంగా ఎదురు చూస్తుంటే సుధాకర్‌కి పిచ్చి పిచ్చి ఆలోచనలు....మద్రాసు వెళ్ళే మెయిల్ రానున్నట్లు బెల్ కొట్టారు. అతని దృష్టి రోడ్డు పైనే వుంది. రిక్షాలు వస్తున్నాయి పోతున్నాయి. కాని మంజుల....

బండి వస్తున్నట్లు ఎనౌన్సుమెంటు మైకులో చేశారు. మైకులో వాడి మాటల్తోపాటే బండి వచ్చింది. పది నిముషాలపాటు ఆగుతుంది.

పదినిముషాలు....పది నిముషాల్లో తన స్వప్నాలు నిజం కావటమో, కూలి దూదిపింజల్లా చెల్లాచెదరుకావటమో....!

పోనీ మంజుల లేకపోతేనేం? డబ్బుందిగా! వెళ్ళిపోయి సినిమా తీసేస్తే?

ఆ ఆలోచన అపశృతిలా విన్పించింది. మంజుల, సినిమా- రెండూ కావాలి.

ఆశ చస్తున్న సమయంలో, మెయిలు కదలబోతున్నదని చెప్తున్నకాలంలో మంజుల వచ్చింది.

'మంజూ....'

ఆమె వొళ్ళంతా చెమటలు కారుతోంది. కళ్ళల్లో భయం, బాధ, దిగులు, కోరిక.... అన్నీ తెరమీద బొమ్మలా క్షణకాలం మెరసి మారిపోతున్నాయి.

రైలు ఎక్కిందాకా పడ్డ ఆందోళన, ఆత్రుత వొక ఎత్తు. ఎక్కాక రైలు కదలటానికి పట్టిన ఆ వొక్క నిముషాన్ని గడిపేయటం మరో ఎత్తు.

'మంజూ....'

'ఊ....'

'అసలేం జరిగింది? ఎలా వచ్చావ్?'

'ఏమో'

'ఎలా వస్తేనేం? వచ్చేశావుగా? నేన్నీ పక్కనున్నాను. యింకెందుకు భయం?'

'నన్నెప్పటికీ వదిలిపోరుగా?' అతని చేతుల్ని చేతుల్లోకి తీసుకొని, భుజంమీద తలవాల్చి భీతితో అంది. ఆమెను అతను పొదివి పట్టుకొన్నాడు. చేతుల్ని ప్రేమతో నొక్కేడు.

'వదలను మంజూ. నిన్ను మహా నటిని చేస్తాను. అప్పుడు నువ్వు నన్ను మర్చిపోకేం?'

ఆమె అతనికి మరింత దగ్గర కావటానికి ప్రయత్నం చేసింది. అతనామెను అందమైన గాజు బొమ్మను పట్టుకొన్నట్లు దగ్గరకు తీసుకొన్నాడు.

మద్రాసు మెయిలు రాజమండ్రికి దూరం అవుతూనే వుంది.

# 21

వారం తిరక్కముందే సినిమా క్కావల్సిన ఏర్పాట్లన్నీ పూర్తి చేశాడు సుధాకర్. స్క్రిప్టు చూచినవాళ్ళెవరూ బాగుందనలేదు. బ్రహ్మాండం అన్నారు. తెలుగు చిత్రసీమలో విప్లవం రాబోతున్నదన్నారు.

కృష్ణమూర్తితో సహా చాలా మంది చిల్లర నటులకు పెద్ద వేషాలిచ్చాడు. ఫొటోగ్రఫీ, మ్యూజిక్, సెట్టింగ్స్- అన్నీ సెట్ అయ్యాయి.

హీరోయిన్ వేషానికి శాంతిశ్రీ బాగుంటుందనుకొన్నాడు సుధాకర్. ఆ వేషానికి ఆమె సరిపోతుంది. ఆమెను మినహాయిస్తే అందరూ కొత్తవాళ్ళు, చిల్లరవాళ్ళు.

'శాంతిశ్రీకి బుకింగ్స్ ఎక్కువయ్యాయి. మీ షెడ్యూలుకు అంగీకరిస్తుందో లేదో! త్వరగా కాంటాక్ట్ చేయండి' అన్నాడు కృష్ణమూర్తి.

శాంతిశ్రీ ఎంతైనా అగ్రశ్రేణి నటి. పాపులారిటీ వుంది. ఆమె వుంటే చిత్రానికి వెయిట్ వుంటుంది.

కాని తన బడ్జెట్ తక్కువ. శాంతిశ్రీకి బ్లాకుమనీతోసహా యివ్వాల్సినదంతా యిచ్చేస్తే పెట్టుబడి తక్కువవుతుంది. మరొక పార్ట్నర్ ఎవరన్నా కలిస్తే బాగుండు....

ఏమయితే అయిందని శాంతిశ్రీ దగ్గరకెళ్ళాడు సుధాకర్. ఆమె అంగీకరించి సినిమా ప్రారంభిస్తే, ఆమె వెయిట్ మీద పెట్టుబడి పెట్టటాని కెవరైనా ముందుకు రావచ్చు.

శాంతిశ్రీ సుధాకర్ చెప్పేది పూర్తిగా వినకుండానే 'ఆలోచించి సెక్రటరీచేత కబురు చేయిస్తా' అంది. వాలకం చూస్తే అప్పటికే తనమీద ఎవరో గొంతులవరకూ చేరవేశారని అర్థమయింది సుధాకరానికి. డీలాపడిపోలేదు సుధాకర్. మొండిగా తన కార్యక్రమాన్ని నడిపించసాగాడు.

హీరోయిన్ నిర్ణయం కాకుండానే అనుకొన్న ముహూర్తానికి సినిమా ప్రారంభమయింది. పరిశ్రమలో పెద్ద ఎవరో ప్రారంభోత్సవం చేసి మొదటి క్లాప్ మంజులమీద కొట్టేడు.

అందరిముందు మంజుల బెదురు చూపులు చూస్తూ అమాయకంగా నిలబడింది, కెమెరాలోకి అలాగే వెళ్ళిపోయింది.

సినిమా సక్సెస్ అవుతుందన్న నమ్మకం ఆ సినిమాలో నటించే ఎవ్వరికీ లేదు.

సినిమా సాగేకొద్దీ సుధాకర్ డబ్బు అయిపోతోంది. డబ్బు అయిపోయే కొద్దీ అందరి అభిప్రాయాలూ ప్రెస్ కి రాసాగేయి.

హీరోయిన్ తో వున్న దృశ్యాలు మినహా సినిమా చాలాభాగం పూర్తయింది. డబ్బుకూడా చాలాభాగం అయిపోయింది. హీరోయిన్ ను యింకా నిర్ణయించకపోతే స్టూడియోల్లో వేసిన సెట్స్ వేస్ట్ గా వుండిపోతాయి. కిరాయి అనవసరంగా యిచ్చుకోవాల్సి వుంటుంది.

ఆ సాయంకాలం ఏం చేయటమా అని ఆలోచిస్తుండగా వొక పెద్దమనిషి వచ్చి పరిచయం చేసుకొన్నాడు. వయస్సు యాభై అయిదు వుంటుంది. పేరు రామనాథం.

రామనాథం హైదరాబాద్‌లో వో గవర్నమెంటు ఆఫీసులో టైపిస్టుగా జీవితంలో చాలా భాగాన్ని వెచ్చించాడు.

రిటైర్‌మెంటు భూతం భయపెడ్తున్న సమయాన ప్రావిడెంట్ ఫండ్ వస్తుందన్న ఆశతోపాటు మరో ఆశకూడా ఆయనలో అంకు రించింది.

ఆ ఆశకు ఆలవాలం ఆయన కూతురు కళ్యాణి. కళ్యాణి అజంతా శిల్పం లాంటిది. తాజ్‌మహల్ ధవళకాంతుల్ని పోలిన వన్నె కలిగింది. ప్రబంధ నాయకి లాంటి వయ్యారం వుంది.

కళ్యాణి సినిమానటి అయితే....?

యీ ఆలోచన వచ్చిన దగ్గర్నించి రామనాథం ఏ సినిమా చూచినా అన్నిసినిమాల్లో నాయికల స్థానంలో కూతుర్ని వూహించు కొని చూచేవాడు. ఆయా నాయకలకన్న కళ్యాణి అందంగా కన్పిం చేది. కాని నటన....?

రామనాథం కొన్ని నాటక సంస్థలతో పరిచయం చేసుకొన్నాడు. వాళ్ళచేత అభ్యర్థింప చేసుకొని కళ్యాణిని నాటకాల్లో వేయించేడు.

కళ్యాణి ఎన్నో నాటక పరిషత్తుల్లో వుత్తమనటి బహు మతుల్ని పొందింది. పేరొచ్చింది. అయినా సినిమాల్లో నటించమని ఎవరూ పిలవలేదు.

ప్రావిడెంట్ ఫండ్‌తో బాటు మద్రాసుకు కూతుర్ని తీసుకొని వెళ్ళేడు. స్టూడియోల చుట్టూ తిప్పేడు. డైరెక్టర్ల యిళ్ళచుట్టూ ప్రదక్షిణాలు చేశాడు.

అంతా పిల్ల బాగుందన్నారు. చూచిందే చూచారు. లొట్టలేసారు. పరాచకాలాడేరు కొందరు. కాని కళ్యాణికి సినిమా ఛాన్సు మటుకు రాలేదు.

అయినా కళ్యాణిపైన ఆశచావలేదు రామనాథానికి. సినిమా తీసేవాళ్ళకు పెట్టుబడి కాస్తోకూస్తో పెట్టయినా సరే హీరోయిన్ వేషాన్ని కళ్యాణికి కొనేయాలనుకొన్నాడు. ఒకసారి కళ్యాణి హీరోయిన్ వేస్తే, ఆ తర్వాత అంతా బంగారమే అని ఆయన నమ్మకం.

ఊరికెళ్ళి భూమి అమ్ముకొచ్చాడు. అప్పుడు తెల్సింది. సుధాకర్ విషయం.

విషయమంతా విన్నాడు సుధాకరం. కళ్యాణిని చూచాడు. రామనాధం తెచ్చిన డబ్బును పుచ్చుకొని కళ్యాణి చేత కంట్రాక్టు మీద సంతకం చెయించాడు.

తన కూతురు యిన్నాళ్ళకు హీరోయిన్ అయినందుకు రామనాథం సంతోషించాడు. అనుకొన్నట్లు కాకపోయినా ఎలాగోలాగు సినిమా పూర్తవుతుందన్న నమ్మకం ఏర్పడింది సుధాకరానికి.

అనుకొన్నట్లే సినిమా తీయటం పూర్తయింది. దాదాపు అందరూ కొత్తవాళ్ళతో నెలాపదిహేనురోజుల్లో పూర్తిచేసిన చిత్రం అని పబ్లిసిటీ యిచ్చారు. విప్లవాత్మక చిత్రం అని వినాయిన్నిచ్చారు. సంచలనాత్మక చిత్రం అన్నారు.

డిస్ట్రిబ్యూటర్లెవరూ చిత్రాన్ని తీసుకోటానికి ముందుకు రాలేదు. చిత్రాన్ని చూపించాక అసలు వద్దన్నారు.

చిత్రం తననుకొన్న విధంగా రాలేదని సుధాకర్‌కీ తెల్సు. ఎన్నో మార్పులు, చేర్పులు. అతుకులు కన్పిస్తున్నాయి. అయినా అది కొత్తతరహా చిత్రం, నిజమైన సినిమా. మంజులను మంజులగా తీసేడు. ఆ పాత్రకు ఆమె సూట్ కావడం వల్ల బ్రహ్మాండంగా నటించినట్లు కన్పిస్తోంది.

"యిలాంటి చిత్రాలు నడవ్వండీ మార్కెట్టులో"

"పాటలు పద్యాల్లేకుండా బొమ్మా!!"

చివరికి ఎవరో చిన్న డిస్ట్రిబ్యూటర్ చిక్కాడు. బొమ్మ రిలీజింగ్ డేట్ యిచ్చారు.

సుధాకర్ గుండెలు కొట్టుకోసాగేయి, ఆ క్షణంకోసం మనసు ఆరాట పడసాగింది.

"మంజూ....రిలీజ్‌కు రాజమండ్రి వెల్దామా?"

"రాజమండ్రే! అమ్మో నాన్న...."

"అటునుంచి అటువెళ్ళి అన్నవరంలో పెళ్ళి చేసుకుందాం"

"ఏం తొందర? రిజల్ట్ చూసుకొనే తిరపతికెళ్ళి చేసుకొందాం"

మంజు రెండునెలల క్రితం మంజు కాదు. మద్రాసు నీళ్ళు

వంటబట్టాయి. సినిమా గాలి హృదయంలో సంగీతాన్ని ఆలపిస్తోంది. జీవితమంటే యిన్నీసుపేటలో తమ యిల్లుకాదు. రాజమండ్రి మురికి వీధులే కాదు. ఆర్ట్స్ కాలేజీ ఆవరణే కాదు. సుధాకర్‌తో ప్రేమే కాదు. మరేమిటి?

ఏమిటో యింకా తెలీదు మంజులకు. కాని ఏదో వుందని తెల్సు. అది తెల్సుకోవాలన్న కోరిక. అనందించాలన్న అభిలాష కలగ సాగాయి ఆమెలో.

"పిక్చర్ రెస్పాన్స్ చూడకోకపోతే నాకు పిచ్చెక్కుతుంది మంజూ. విజయవాడ,రాజమండ్రి సెంటర్లలో రెస్పాన్స్‌చూస్తే చాలు. ఆంధ్రదేశపు నాడీ సెంటర్లవి"

"సారీ. నువ్వెళ్ళిరా సుధాకర్. నేనొస్తే రాజమండ్రిలో గొడవవుతుంది"

సుధాకర్‌కు ఆశ్చర్యమేయలేదు మంజుల మాటలు. మంజు లలో పిరికితనం పోయి, సొసైటీలో మనిషిగాకావటానికి అతను చేయాల్సిన ప్రయత్నాలన్నీ చేశాడు. ఫలితం యిది. కాని ఎంతకాజ్యు వల్‌గా మాట్లాడుతోంది?

మంజుల సుధాకర్‌తో వెళ్ళటం లేదని తెల్సిక కళ్యాణిని తీసికెళ్ళమని కోరేడు రామనాథం.

"ఎలాగైనా పిక్చర్‌లో హీరోయిన్. నువ్వు హీరోవి. తీసి కెళ్ళు. తప్పేముంది?" అంది మంజుల.

సుధాకర్‌కు, కళ్యాణికి వీడ్కోలు చెప్పటానికి స్టేషన్‌కెళ్ళింది మంజుల. బండి కదలటానికి సిద్ధంగా వుంది.

"హల్లో సుధా...."

సుధాకర్ వెనక్కి చూచాడు.

"ఓ! బావగారూ, మీరా...."

"హైదరాబాద్ నుంచి యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయిందోయ్. మీ సిస్టర్‌ని యింకా తీసుకురాలేదు. సినిమా తీస్తున్నావుటగా? వీళ్ళెవరు?"

పరిచయం చేశాడు. మురళీమోహన్ తనని తాను పరిచయం చేసుకొన్నాడు.

"ఐసీ. మంజులంటే యీమెనేం? బాగా చేసిందని విన్నాలే. ఫీల్డంతాఇప్పుడే యీమెను గురించి చెప్పుకొంటోంది."

గార్డు విజిల్ వేశాడు. రైలు గాండ్రుమంది.

పరుగెత్తుకొంటూవచ్చి రామనాథం రైల్లో పడ్డాడు,

"గుడ్‌బై మంజూ, యీ నాలుగు రోజులూ జాగ్రత్త"

సెంట్రల్ స్టేషన్లో వెల్తుర్ని వదిలేసి కలకత్తా మెయిలు చీకట్లోకి పరుగులు తీస్తోంది।

# 22

"విరా అన్నయ్య పిక్చర్ యివాళ రిలీజ్ అవుతోందట. వెళ్దాం వస్తావా?"

అడిగిన శ్రీమహావిష్ణువు వైపు మెరుపుచూపు చూచింది చిత్ర.

"ఓ। మీకెప్పటి సంగతో గుర్తుకొచ్చినట్లుంది. కాని నన్నంత సీచుడుగా చూడకు. నువ్విప్పుడు "చిత్రప్రియ"వి మాత్రమే కావని నాకు తెల్సు మిసెస్ వేదవ్యాస్"

మిసెస్ వేదవ్యాస్। మిసెస్ వ్యాస్।।

"నో, నన్నలా పిలవకు. పెళ్ళయినంత మాత్రాన నా వ్యక్తిత్వాన్ని పేరును మర్చిపోయే నాగరికతను నేను అనుమతించలేను."

"అయాం సారీ"

"సమానత్వం కావాలనే స్త్రీలుకూడా యీ అసమానత్వాన్ని. పురుషుడి యీ సుపీరియారిటీని ఎందుకంగీకరిస్తారో నాకు తెలియదు. ఏం? భార్య పేరుకు మిస్టర్ తగిలించి భర్తల నెందుకు సంబోధించ కూడదు?"

"ఎందుక్కూడదు? మీరే నా భార్య అయితే అందరితో నన్ను "మిస్టర్ చిత్రప్రియ" అని పిలవమని చెప్పివుండేవాడిని."

ఆమాత్రానికే పొంగిపోయింది చిత్రప్రియ. అందులో కిటుకును గ్రహించలేక "థాంక్యూ" అంది.

"ఏంటిమరి? సినిమాకెళ్దాం వస్తావా? నాతో వొంటరిగా రానక్కర్లేదు. మా సిస్టర్ కూడా వస్తుంది"

"ఆల్‌రైట్. వస్తాను" విష్ణువుమీద క్షణికంగా కలిగిన ఆ మంచి భావనలో అంగీకరించింది. కాని యింటికొచ్చాక ఎందుకొప్పుకొన్నానా అని విచారించింది.

అయిష్టంతోనే సినిమాహాలు దగ్గరికెళ్ళింది. విష్ణువు రిసీవ్ చేసుకొన్నాడు. చెల్లెల్ని పరిచయం చేశాడు. వుమెన్స్ కాలేజిలో ఇంటర్ చదువుతోంది.

హాల్లోకి అడుగుపెట్టుంటే మళ్ళీ అదే సంకోచం!

మధ్య కుర్చీలో తను కూర్చుని అటు చెల్లెల్ని. యిటు చిత్ర ప్రియను కూర్చోమన్నప్పుడు మళ్ళీ అదే సంకోచం! అతనివైపు అదో విధంగా చూచింది.

'ఓ! అయాం సారీ. మీకు పెళ్ళయింది కదూ?'

'అయితే?'

'మీ పక్కన కూర్చునే అర్హత లేదుగా!'

'కాకపోతే వుందా?'

'మీతో పరిచయం లేకపోతే వుందిగా కనీసం?'

అవును. తన ప్రక్క కుర్చీ ఖాళీగా వుంటే ఏ మగాడన్నా కూర్చుంటే తనెలా కాదనగలదు? ఎన్నిసార్లు తనపక్కసీట్లో ఎవరో మగాళ్ళు కూర్చోలేదు?

'కూర్చోండి'

ఆమె అతని పక్కనే కూర్చుంది.

సినిమా ప్రారంభమయింది. వచ్చేజనం, కూర్చునే జనంతో రద్దీగా వుంది హాలంతా.

మొదటిరోజు మొదటి ఆట మేట్నీ చూచినవాళ్ళు అప్పటికే కామెంట్స్ చేస్తున్నారు.

సినిమా చూస్తున్నాడన్న మాటేగాని విష్ణువు మనసంతా పక్కనున్న చిత్రప్రియపైనే వుంది. ఆమె అతనికి కొరకరానికొయ్య అయింది. యింతకుముందు ఎన్నో పిట్టల్ని పట్టేడు అతను. అన్నంలో

నంజుకు తిన్నాడు. కాని యీ పిట్ట దొరకకుండా దూరంగా పోదు. దగ్గరకొచ్చి దొరికిపోదు.

అతని చెయ్యి ఆమెచేతిని వెతుకుతోంది. అది చిక్కక ముందే అతని కాలు ఆమె కాలుతో సంభాషిస్తోంది

'సినిమా చూస్తున్నావా విష్ణూ?'

'ఆ....ఆ....చూస్తున్నా. మీ అన్నయ్య నటన బాగుంది'

యిమీడియట్‌గా వో బేటరీలైట్ ఫోకస్ చిత్రప్రియ మొహంలోకి పడి కళ్ళల్లో గుచ్చుకొంది.

'అమ్మాయీ....నువ్వు నమశ్శివాయ కూతురువా?' పక్కకుర్చీ అడిగింది.

'అయితే అవుతుంది. మీరెవరు టార్చి నా మొహాన వేయటానికి'

'మొన్న పెళ్ళయిన పిల్లవుకదూ? చూడబోతే అతను నీ భర్తగా కన్పించడు?'

"ఇంతకీ మీ రెవరు?"

పక్కకుర్చీలో పెద్దమనిషి జవాబివ్వలేదు. మళ్ళీ ప్రశ్నించాడు

"అయితే నమశ్శివాయ వంశమే అలాంటి దన్నమాట! చెల్లెలు వున్న వూళ్ళోనే భర్తను వదిలేసి మరోడితో తిరుగుతోంది. అన్న మాత్రం పిరికి లంజకొడుకై ........"

చిత్రప్రియకు భయమేసింది. ఎదురు తిరగాలనిపించలేదు.

"అవును కాని నువ్వెవడివిరా? నీకు ఆ వెధవ నటన బాగుంది? నా కూతురి నటన బాగాలేదూ? నువ్వు గుడ్డోడివా? చెవిటోడివా? రెండూ వున్న వాడివా? కళ్ళుంటే చూడరా. నా కూతురి నటన"

పక్కనకూర్చున్న పెద్దమనిషి రౌడీ ప్లీడరు చౌదరని బోధ పడ్డాక యిద్దరికీ పై ప్రాణం పైనే పోయింది.

"ఆమె నటనకేమందీ? బ్రహ్మాండంగా వుంది."

ఈ గొడవకి పక్కవాళ్ళు విసుక్కోటంతో అంతటితో ఆగి పోయింది.

అదే సమయంలో మరో మూల వేదవ్యాస్, సాగర్ సినిమా చూస్తున్నారు.

"వ్యాస్, ఏమోననుకొన్నా. మీ బ్రదరిన్లా గట్టివాడే సినిమాని సినిమాలా తీసేశు."

"ఏం, నీకు నచ్చిందా?"

"నీకు నచ్చలేదా?"

"నా సంగతి కాదు. ఆ నేల తరగతిలోవాళ్ళకి నచ్చటం లేదు. వాళ్ళే ఈ సినిమాలకు మహారాజ పోషకులు."

"అయితే, వాళ్ళ అభిరుచుల్ని మార్చనక్కరలేదంటావా?" ఆ పని మీ వాడు చేశాడు. అందుకు నీకు కంగ్రాచ్యులేషన్స్."

కాని ఆ కంగ్రాచ్యులేషన్స్ అందుకోవల్సినవాడు వాళ్ళవెనుకే వున్నాడు. అందుకొన్నాడు మౌనంగానే.

"ఆ పిల్ల నటన చాలా సహజంగా లేదూ?"

అప్పుడు తెరమీద వున్నబొమ్మ మంజులది.

"అది నటన కాదు. సహజంగానే అలాంటిపిల్లను తెరకెక్కించాడు దర్శకుడు."

"నిజం వ్యాస్. నేనే పొరపడ్డాను. ఏమైనా ఆ పిల్లసూపర్ స్టార్ అవుతుంది."

ఇంటర్వెల్ అయింది. ఎవరి నోట విన్నా మంజులనిగురించిన పొగడ్తే. సినిమా బాగాలేదనే. లైట్లు పడకముందే సుధాకర్ నేల గేటు దగ్గరకెళ్ళి వాళ్ళ కామెంట్స్ వింటున్నాడు.

చిత్రప్రియ లైట్లు వెలక్కముందే యింటికెళ్ళిపోదామనుకొంది. కాని అలా వెళ్ళిపోతే తనను పిరికిదానిగా భావించుకొంటాడు శ్రీమహావిష్ణువు. మరీ చులకనైపోతుంది. తప్పుచేసినట్లే అనుకొంటాడు పావనిగాడు.

కూర్చుంది—కుర్చీలో కాదు—ముళ్ళ మీద. లైట్లు వెలిగాయి. వాటిని సూటిగా చూడలేకపోయింది.

చౌదరిగారు వాకిట్లోకెళ్ళేరు.

"కమాన్ చిత్రా. మనమూ అలా వెళ్ళి డ్రింక్స్ తీసుకొద్దాం."

"వద్దు, కాని నువ్వీ సీటులోకి రా. నేను మీ సిస్టర్ సీటులోకెళ్తాను."

సీట్లు మారటం కోసం యిద్దరూ లేచారు. ఎదురుగ్గా వ్యాస్–సాగర్!

వాళ్ళు క్షణం వీళ్ళిద్దర్నీ చూచి స్తబ్ధులై నిల్చుండిపోయారు వ్యాస్, సాగర్‌లు. కాని వెనుకనుంచి జనం నెడ్తున్నారు. జన ప్రవాహంతో పాటు ముందుకు నడిచిపోయారు.

దిమ్మతిరిగిపోయింది చిత్రప్రియకు. వెళ్తున్న వేదవ్యాస్‌ని పిల్చి ఏమో చెప్పాలనిపించింది.

"వాళ్ళు యీ సినిమాకే వస్తారనుకోలేదు చిత్రా. అలాగనుకుంటే మరో సినిమాకైనా పోయుండేవాళ్ళం"

బాకులు, బల్లేలు పెట్టి గుండెల్లో గుచ్చినట్లొచ్చాయి శ్రీ మహావిష్ణువు మాటలు! అలాగే బయటికి నడిచివచ్చి రిక్షా ఎక్కింది.

"చిత్రా"

ఆ గొంతు వ్యాస్‌దే. గుర్తుపట్టింది.

"ఒక్క మాట"

ఆ మాటేమిటో చిత్రప్రియ వూహించుకో గలదు. ఆ మాటను వినలేదు.

"పోనియ్ రిక్షా—"

వేదవ్యాస్ తన భుజం పట్టుకున్న సాగర్ వైపు చూచాడు. అతని మొహం పాలిపోయింది. గొంతులో ఎంతో విషాదం.

"ఇంటికెళ్దామా?"

"ఎందుకు? సినిమా బాగాలేదా?"

సాగర్ సమాధానం రాక తడబడ్డాడు.

"అందుగ్గాదు-"

"పిచ్చి సాగర్! యిది జీవితం ఎన్నో వాడిదుడుకుల్ని ఎదుర్కోవల్సి వస్తుంది. పారిపోవటం పిరికివాళ్ళ లక్షణం."

హాల్లోకి నడిచాడు వ్యాస్. వెంబడించాడు సాగర్.

"ఏం బావగారూ? సినిమా ఎలా గుంది?"

"సుఫాకర్!"

"గట్టిగా అరవకండి. జనం మీద పడగలరు. మీ సంభాషణ

విన్నాలే. థేంక్స్! లోపలికి పోదాం పదండి. హీరోయిన్ మీ సీటు వెనకాలే వుంది."

ముగ్గురూ లోపలికి అడుగుపెట్టబోతుండగా "చిత్రం ఎలాగుంది" అని అడిగేడు మళ్ళీ సుధాకర్. ఏమని జవాబివ్వగలడు?

"బాగుంది—"

మరో నిముషం అయితే థియేటర్లోని చీకటిలో ముగ్గురూ కల్సిపోయేవారే కాని యింతలోనే ఒహో చెయ్యి సుధాకర్ మెడ మీద పట్టుకొని నిలిపింది.

"మంజుల ఎక్కడ?"

"సినిమాలో వుందిగా!"

"సినిమాలో వేషం వేయించటానికి తీసుకెళ్ళావన్నమాట నా కూతుర్ని? మాట మాత్రం నాతో చెప్పకుండా తీసికెళ్లి మళ్ళీ ఎన్ని గుండెల్తో రాజమండ్రికొచ్చావ్?"

"శ్రీ కృష్ణుడు రుక్మిణిని రుక్మితో చెప్పి తీసుకెళ్ళాడా?"

తన ముందు నిలబడి యింత ధైర్యంగా సమాధానాలిస్తాడనుకోలేదు చౌదరి. కుర్రాడిక వృద్ధిలోకొచ్చే లక్షణాలున్నాయని తనప్పుడే అనుకొన్నాడు.

"అయితే ఈ కృష్ణుడు రుక్మిణిని పెళ్ళి చేసుకొన్నాడా?"

"లేదు. మీరు లేకుండా చేసుకొంటానా?"

"కాని నీ చెల్లెలు మొగుడినొదిలేసి ఎవడితోనో సినిమాలు చూస్తోంది. మిమ్మల్ని నమ్మిందెవరు?"

సుధాకర్ వ్యాస్ వైపు చూడలేక చూచాడు.

"మీరు పొరబడ్డారండి. మొగుడినొదిలెయ్యలేదు చిత్రప్రియ. నే నిక్కడే వున్నాను అంతా కల్సే వచ్చాము. అన్నపక్క చెల్లెలు కూర్చోటం తప్పు కాదుగా!"

సుధాకర్ చౌదరికి వేదవ్యాస్‌ను పరిచయం చేశాడు.

"సారీ మిస్టర్. పొరపాటు పడ్డాను. అయినా ఆ పిల్ల ఆ మాట చెప్పలేదేం?

"సినిమా ఎలాగుంది?"

"నిజమైన సినిమా లాగుంది. కాని నువ్వు నటించకుండా

వుండాల్సింది. అల్లుడూ నువ్వు స్టేజీకే గాని తెరకు పనికిరావను కొంటా. మంజూ బ్రహ్మాండంగా వుంది. ఆ హీరోయిన్ ఎవరు? మెరకవీధి నుంచి పట్టుకెళ్ళావేంటి?"

"ఆమె యిక్కడేవుంది"

"అయితే రుక్మిణి వదిలేసి సత్యతో షికార్లు చేస్తున్నావన్న మాట!"

"అంత సీరియస్‌గా చూడకండి మామగారూ నన్ను. నీతివున్న మనిషినే. మంజుల నా ప్రాణం. మంజుల మీకు భయపడి రానంది"

"నేనే వస్తాలే. ఎలాగైనా నా కూతురు సినిమా నటికదా!"

తన కుర్చీలో కూర్చుంటూ పక్కకి చూచాడు. సీటులో చిత్రప్రియ లేదు.

"ఎక్కడికెళ్ళిందా అమ్మాయి?"

శ్రీ మహావిష్ణువు మళ్ళీ పిట్ట పారిపోయిందన్న చిరాకులో అన్నాడు.

"మొగుడి దగ్గరకు"

చౌదరి తృప్తిగా నిట్టూర్చాడు.

# 23

నాలుగు సెంటర్లు చూచాక నీరు కారిపోయాడు సుధాకర్. పిక్చరుకు పెట్టుబడి వస్తుందన్న నమ్మకం లేదు. సినిమా నటుడిగా స్థిరపడే ఆశ లేదు. చిత్రరంగంలో తన సినిమా ఓ మైలురాయిగా మిగులుతుందన్న హోప్ లేదు.

ఎటొచ్చీ సినిమా చదువుకున్న విజ్ఞానవంతులకు నచ్చింది. కొత్తనీరు వస్తుందన్న ఆశ కొందరిలో కలుగజేసింది. దర్శకత్వపు విలువలు తెల్సినవారి దృష్టిలో సుధాకర్ దర్శకుడయ్యాడు.

అయితే అందరూ మెచ్చుకుంది మంజులను. సందేహం లేదు. మంజుల తప్పక సినిమానటి అయింది. ఆమె డిమాండు పెరుగుతుంది.

తను తీసిన భావనా చిత్రం అందర్నీ ఆకర్షించకపోవచ్చు.

కాని మంజుల తను మలచిన బొమ్మ. తను భూమిలోనుంచి త్రవ్వి తీసిన బొమ్మ. తన హృదయంలో ప్రతిష్ఠించుకున్న చక్కటి బొమ్మ.

మంజులను గురించి మధుర భావనలు నిండిన మనసుతో మద్రాసు చేరుకొన్నాడు సుధాకర్. తన వెనకే డబ్బాలు తిరిగొస్తా యన్న బాధ అతన్ని వదిలేసింది.

ఎంతో ఆనందంతో యింట్లో అడుగు పెట్టబోతున్న సుధాకర్ చటుక్కున ఆగేడు.

"ఆ ప్రొడ్యూసర్ వస్తాడంటావా మురళీ?"

అడుగుతున్నది మంజుల. మురళీమోహన్ తన బావ.

"నా కోసం వస్తాడా? నీ కోసం వస్తాడు. తన సినిమా సక్సెస్ కోసం వస్తాడు. వాడు రాకపోతే వాడి తాతలు వందలకొద్దీ నీ కాళ్ళ దగ్గరకొస్తారు. యీ ఫీల్డులో నీ కనుభవంలేదు మంజూ. మొక్కను మొలవ నివ్వరు. మొండికెత్తి మొలిచిందా, నాలాంటి ఆధారం దొరికితే ఆకాశానికి అల్లుకు పోతుంది. నేనున్నానుగా?"

మురళీమోహన్ సంగతి వోసారి అక్కే అమ్మతో చెప్తుంటే విన్నాడు సుధాకర్.

అతను రంగేళీరాజు. చేసేది సెంట్రల్ ఎక్సైజ్ వుద్యోగం. కస్టమ్స్ బ్రాంచి వదలడు. అధికారం వుంది. సినిమా వాళ్ళకి అతనితో లక్షల అవసరాలు.

మురళీమోహన్‌కి అసలు వుద్యోగం చేయాల్సిన అవసరం లేదు. పురుష లక్షణం అని నిరూపించడం కోసం చేస్తున్నాడు. దొడ్డి మార్గాలు లక్ష వున్నా అతడు డబ్బుకు కక్కుర్తిపడే అవసరం లేదు. పడడు.

అతనికి చిన్నతనం నుంచి సినిమాలంటే వో ఫేన్సీ. సినీ తారలంటే వ్యామోహం.

కస్టమ్స్ వుద్యోగం అతన్ని ఆ లోకానికి, ఆ తారలకి దగ్గర చేసింది. వాళ్ళతో తిరగటం అతనికో సరదా.

అతనికున్న మరో సర్దా ఆడది. అందమైన ఆడదంటే అతను

పడి వస్తాడు. వాళ్ళ వెంట తిరగటం, వాళ్ళని వెంటేసుకు తిరగటం అతడు గర్వంగా ఫీలవుతాడు.

ప్రొడ్యూసర్ల దగ్గర్నుంచి క్లాప్ బాయిస్ దాకా మురళీ మోహన్‌ని తెలియనివారు లేరు. అతని డబ్బు తినని వాళ్ళు లేరు. సహాయాన్ని పొందని వాళ్ళు లేరు. అందుకే ఫీల్డులో అతని మాటకు విలువుంది. కాని ఆ విలువని పోగొట్టుకొనే పనులే చేస్తుంటాడతను.

ఇలా తిరుగుతున్నాడని తెల్సే అధికారులు అతన్ని ఎన్నో సార్లు మద్రాసు నుంచి బదిలీ చేశారు. కాని తండ్రికున్న రాజకీయ పలుకుబడినుపయోగించి మళ్ళీ మళ్ళీ మద్రాసుకు బదిలీ చేయించు కొంటూనే వున్నాడు. అది అతని సర్దా.

"అయితే, నేను మొండికెత్తి మొలిచిన మొక్కనంటారు!"

"కాకపోతే తెలుగు సినిమా రంగాన్ని వుద్ధరించటానికి యింద్రలోకం నుంచి వచ్చిన కల్ప వృక్షానివే కావచ్చు"

వాకిలి దగ్గరే నిలబడిపోతే యిలాంటి మాటలు యింకెన్ని వినవలసివస్తుందో అనుకొంటూ లోపలి కడుగుపెట్టేడు సుధాకర్. ఇద్దరూ ఆశ్చర్య పోయారు.

"మీరూ వచ్చేశారా! టెలిగ్రాం అయినా యివ్వారుకాదు!"

సుధాకర్ మంజుల ప్రశ్నకు సమాధానం యివ్వలేదు. మురళీ మోహన్ కేసి తిరిగేడు.

"ఏం బావగారూ! అక్కయ్యను హైద్రాబాద్ నుంచి పిల్చు కొచ్చారా!"

"లేదోయ్. అందుకే ఈ నాలుగు రోజులబట్టి మంజుల రమ్మంటే మీ యింట్లోనే వుంటున్నాను."

అయితే వ్యవహారం ఈ నాలుగు రోజుల్లో చాలా దూరం పోయిందన్నమాట.

"పిక్చర్ ఎలా పోతోంది సుధా! సెంటర్స్‌లో టాక్ ఎలాగుంది!"

"ఇక్కడికొస్తున్న రిపోర్టుల్ని బట్టయితే మంజుల బాగా స్కోరు చేసింది. అప్పుడే రెండు ఆఫర్లుకూడా వచ్చాయి హీరోయిన్ వేషానికి."

మంజుల కళ్ళల్లోకి సూటిగా చూశాడు సుధాకర్. ఆమె తల వంచుకొంది.

తన సొత్తనుకొన్నాడు మంజులని. కాని యీ సినిమా ప్రపంచం మంజులని తన సొత్తుచేసుకొంటోంది. ఆ ప్రపంచంలోని ప్రలోభాలకు లొంగిపోతే మంజుల తనది కాదు. తన చేతిలోనుంచి మాణిక్యం జారిపోతుంది.

అప్పుడే ఓ ప్రొడ్యూసర్‌కి కాంట్రాక్టు యిచ్చింది. మరో ప్రొడ్యూసర్‌కి ప్రామిస్ చేసింది. అతనిపుడు రావాలి.

మురళీమోహన్ బావలా కన్పించలేదు. శిశుపాలుడిలాగున్నాడు.

"బావగారూ ప్లీజ్. నేనిపుడే వస్తున్నాను. మమ్మల్ని కాసేపు ఏకాంతంగా వదిలేయండి"

"అభ్యంతరమేముంది? నీ గదిలో రెస్టుతీసుకో. ఆ ప్రొడ్యూసర్ వస్తే నేను చూచుకుంటాగా"

"యిప్పుడే ప్రొడ్యూసర్ రావటానికీ వీల్లేదు. వచ్చినా మంజుల మాట్లాడదు."

వాకిట్లో కారు హారన్ చప్పుడు.

"అదుగో ప్రొడ్యూసర్ వచ్చాడు"

"మీ రెళ్ళి వచ్చిన దారినే వెళ్ళమని చెప్పండి. వీలుంటే ఆ కారులో మీరూ వెళ్ళండి."

"అంటే-? ఏమిటి నీ వుద్దేశం? మంజుల జీవితాన్ని రూయిన్ చేస్తావా? ఆమె పైకి పోవటం నీకు యిష్టం లేదా?"

"మంజు విషయం నేను చూసుకోగలను బావా. నువ్వు ముందు నేను చెప్పినట్లు-"

"నువ్వేమంటావు మంజులా...."

"మంజుల యిప్పుడు ఆ ప్రొడ్యూసర్‌తో మాట్లాడదని నేను చెప్తున్నాను—"

మంజుల కళ్ళలోకి చూచేడు మురళి. అతని కళ్ళు ఆమెని ఆకర్షించాయి ఇంద్రలోకాలకు పిలుస్తున్నట్లు కన్పించింది.

మరోవైపునుంచి ఆమె కళ్ళలోకి చూచాడు సుధాకర్. ఆ కళ్ళు

ఆమెను భయపెట్టేయి. అధఃపాతాళ లోకాలకి లాక్కుపోతున్నట్లని పించింది.

ఒక్క క్షణం నిశ్శబ్దం. వాకిట్లో కారు డోరు తెర్చిన చప్పుడు.

"ప్రొడ్యూసర్ గారొస్తున్నట్లున్నారు. లోపలికి ఆహ్వానించు మురళీ—"

మురళి వాకిటి వైపు నడిచాడు. మంజుల మొహం చూడ లేనట్లు లోపలికెళ్ళాడు సుధాకర్.

అయిదు నిమిషాల తర్వాత అతని గదిలోకొచ్చింది మంజుల.

"కోపం వచ్చిందా?" అతని క్రాపులోకి వేళ్ళదూర్చి తడుముతూ అంది.

"యింటిముందు కొచ్చిన పెద్దమనిషిని కాదని ఎలా వెళ్ళమనను చెప్పు? అయినా రావటం రావటమే మురళితో తగువేసుకున్నావు-"

"అతన్ని మనింటికి ఎందుకు రమ్మన్నావు?"

"అతను నాకు చుట్టమా? నీకు చుట్టమా? నీ బావేకదా! పోనీయ్ నీ యింట్లోనే వుంటాడు కదా అని రమ్మన్నాను."

"అతని సంగతి నీకు తెలీదు"

ఆ మాట అనటంలో పొరబడ్డాడు సుధాకర్. మురళిని యిప్పుడు మంజులకి చాలా తెల్సునని అతనికి తెలీదు.

"మాటల్తో బతికే వాళ్ళంటే నాకుమంట. సినిమాలో నటుడిగా ఛాన్సు కోసం అతని చుట్టూ నెల తిరిగేను. నాకు చివరికి దొరికిందేమిటో తెల్సా! ఎక్స్ట్రా వేషం. నా సినిమాకు సహాయం చేయమని ఎన్నో వుత్తరాలు రాసేను. కనీసం సమాధానం రాశాడు కాదు. యివాళ సినిమా తీసేక నేను కావల్సివచ్చింది."

మళ్ళీ పొరపాటు. మురళికొావల్సింది బావమరిది కాదు. తను మంజుల అని ఆమెకి తెల్సు!

"యీ గొడవలన్నీ నాకేం తెల్సు? నీ బావగారేకదా అనుకొన్నాను. యీ రెండు కాంట్రాక్టుల్ని అతనే పట్టుకొచ్చాడు"

"నీకు కాంట్రాక్టుల్ని ఎవరూ పట్టుకురానక్కరలేదు. అవే వస్తాయి. నీ పేరు దేశమంతటా మోగిపోతోంది. ఆనాడు విన్ను మహానటిని చేస్తానన్నాను. చేస్తాను."

"నాకు తెల్సు. నువ్వు ఆనందిస్తావనే నిన్న సంతకం పెట్టేను యిదిగో కాంట్రాక్టు. నువ్వు సంతకం పెట్టమంటేనే పెట్తాను."

"యిపుడు పెట్టవద్దు. రేపు రమ్మని చెప్పు"

"అతను మరొకర్ని బుక్ చేస్తే?"

"చేసుకోనియ్. నీకు బోలెడు వేషాలొస్తాయి"

"కాని అతడు పేరుమోసిన ప్రొడ్యూసరటగా! అతన్ని రేపు రమ్మంటే బాగుంటుందా?"

"అతను రేపు వస్తేనే బాగుంటుంది."

మంజుల డ్రాయింగ్ రూంలోకి వెళ్లింది. మరో అయిదు నిముషాల్లో మళ్ళీ వచ్చింది.

"ప్రొడ్యూసర్ వెళ్లాడా?"

"పంపించేశాను. మురళి కూడా వెళ్లాడు. యిప్పుడు చెప్పు కబుర్లు."

"మీ నాన్న కన్పించాడు."

"కన్పించి? తన్నేడా? కేసు పెట్టేడా?"

"నుంజుని పెళ్లి చేసుకొన్నావా లేదా అని నిలేశాడు. 'చేసుకోలేదింకా' అంటే పెళ్లి వెంటనే చేసేసుకో అన్నాడు. రేపే తిరపతి ప్రయాణం."

సుధాకర్ ఆశించిన సంతోషం మంజులలో కన్పించలేదు.

"ఏం? ఈ వార్త సంతోషంగా లేదా? పోనీ రాజమండ్రి వెళ్లి మీవాళ్ళను కూడా తీసుకెళ్లి అన్నవరంలో చేసుకుందాం."

"మన పెళ్లికిప్పుడంత తొందరేం?"

"సినిమా తీసాను. పెళ్లి కూడా చేసేసుకుంటే అనుకున్న పనులు రెండూ అయిపోతాయి. అయినా పెళ్లి చేసుకోకుండా ఎన్నాళ్ళని యిలా వుండటం? లోకం ఏమనుకొంటుంది?"

"ఇన్నాళ్ళబట్టి ఏమనుకొందో అదే అనుకొంటుంది."

"అయితే నీకిష్టంలేదా?"

"ఏమిటి?"

"పెళ్లి"

"ఇప్పుడప్పుడే యిష్టంలేదు."

"మంజులా మొన్న జరిగిన సంగతులు అప్పుడే మర్చిపోతున్నావా? మన కథని గుర్తు తెచ్చుకో."

"చిన్నప్పుడు మా అమ్మమ్మ చెప్పిన కథలు కూడా గుర్తున్నాయి."

"మాటకారివయ్యావే!"

"నువ్వేగా నేర్పేవు?"

"నీకు నాకన్నా సినిమా ఎక్కువన్నమాట!"

"నీకుమాత్రం? కాకపోతే ఆనాడే ఎందుకు పెళ్లి చేసుకోలేదు? సినిమా తీసిందాకా ఎందుకాగేవ్? యిప్పుడంత తొందరెందుకొచ్చింది?"

"నీ వుద్దేశ్యం ఏమిటి?"

"నీ వుద్దేశ్యమే! సినిమా నటి కావటం. మహానటి కావటం."

అలా ఎదురుతిరిగి మాటకుమాట సమాధానం చెప్తూన్న మంజులను చూస్తూంటే అతనికి కోపం వచ్చింది. ఆ కోపంలో ఆమెను గట్టిగా దగ్గరికి లాక్కొని నలిపెయ్యాలన్న కచ్చ పుట్టింది.

"మంజూ...." అతను పట్టలేని తమకంతో ఆమెను దగ్గరికి లాక్కున్నాడు.

ఇన్నాళ్ళ యిద్దరి ఏకాంత జీవనంలో అతనిలాంటి పనెన్నడూ చేయలేదు. చేస్తే బాగుండునని ఆమె ఎన్నోసార్లనుకొంది. ఏకాంతాన్ని భరించలేక ఆమె అప్పుడప్పుడూ అతనికి దగ్గరగా వెళ్తే అతను 'సినిమా, పెళ్లి' అన్న రెండు మంత్రాలు జపించి ఆమెను దూరంగా వుంచేవాడు.

"మంజూ....!"

అతని కౌగిట్లో వదిగిపోలేదు ఆమె. నాలుగు రోజుల క్రితమైతే కరిగిపోయివుండేది. కాని ఆమె కిప్పుడు ఆ సుఖం నాలుగు రాత్రుల పాతది. మురళితో స్నేహమంత పాతది.

ఆమె అతని పట్టు వదిలించుకొని లేచింది.

"ముందు మహానటిని కావద్దూ" అంటూ వెళ్ళింది.

ఆమె అప్పటికే పెద్ద నటి అయిందని, యింతవరకు ఆమె తన దగ్గర నటించిందని తెల్సుకోటం కష్టమేం కాదు సుధాకర్‌కి.

అతను విచారించాడు - ఆమె నటి అయినందుక్కాదు. అదృష్టం మరోమారు పెడేలున తన మొహంమీద తన్నినందుకు.

# 24

ఎప్పుడో సంవత్సరం క్రితం హైదరాబాద్ చూద్దామన్న సర్దాతో వెళ్ళొచ్చిన ఇంటర్వ్యూ తాలూకు వుద్యోగం యిప్పుడొచ్చింది వేదవ్యాస్‌కి. నెత్తిమీదనుంచి పెద్ద బరువు దించినట్లు ఫీలయ్యాడు.

సాగర్‌తో చెప్పేడు.

"వెళ్లి చేరతావా?"

"సలహా చెప్పు."

"ఏం చెప్పను? కలెక్టర్‌వి కావాల్సినవాడివి. అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో అప్పర్‌డివిజన్ గుమాస్తావవుతావా? ఐ. ఎ. యస్. పరీక్ష కూడా రాశావుగా! "రిజల్టు వెయిట్ చెయ్యి."

"నేనీ వూళ్లో యిక వుండలేను సాగర్."

"పిరికితనంతో పారిపోవటం సమస్యలకు పరిష్కారం కాదని నువ్వే అన్నావు"

"పారిపోను సాగర్. కాని నాకిప్పుడు కాస్త మార్పు అవసరం."

కొడుకు గుమాస్తా వుద్యోగానికి వెళ్తానంటే సూరిశాస్త్రి మనసులోని చిత్రాల మీద యింకు చల్లినట్లయింది.

"మహారాజు జాతకంరా నీది. అయినా పెళ్లి అలా చేసుకొన్నావ్? గుమాస్తా వుద్యోగంలో కూరుకుపోతే పైకి రాగలవా?"

కాంతాంబ కన్నీళ్లే పెట్టుకొంది

"బ్రహ్మలిఖితం ఎవరు తప్పించగలర్లే! అక్కడైనా మనశ్శాంతి దొరకుతుందేమో వెళ్లి ప్రయత్నించు."

ఉద్యోగంలో చేరటానికి నిర్ణయించుకొన్నాక నమశ్శివాయ గారింటి కెళ్ళేడు.

ఆ రోజు సినిమాలో చిత్రప్రియను ఆ స్థితిలో చూడటమే. మళ్ళీ ఆ తర్వాత కన్పించలేదు.

సినిమాలో జరిగింది నమశ్శివాయకు చూచాయగా తెల్సింది. కూతురిని పిలేసి లాభంలేదు. అల్లుడికోసం సూరిశాస్త్రి యింటికి వెళ్ళలేదు.

"యమ్మెస్సీ పరీక్షలో బాగా రాశేవా?"

"ఊ...."

"ఐ. ఎ. యస్.కు కూడా అపియర్ అయ్యావుటః"

"అయ్యాను."

"అమ్మాయిని చూట్టానికైనా అప్పుడప్పుడూ రాకూడదూ?"

నవ్వక తప్పలేదు. నవ్వేక కాని ఆ నవ్వు అర్థం ఏమిటో అవగాహనకు రాలేదు వేదవ్యాస్‌కు. సర్దుకొంటున్నట్లు 'ఎందుకు రాకూడదూ?' అన్నాడు. కాని ఆ నవ్వులోని భావాన్ని అర్థం చేసుకోలేనంత వెర్రివాడు కాదు నమశ్శివాయ.

"ఉద్యోగం వచ్చింది. హైదరాబాద్ వెళ్తున్నా. మీ ఆశీర్వచనం."

"ఏం వుద్యోగం?" నమశ్శివాయకు కొండెక్కినంత సంబరం అయింది. అల్లుడికి వుద్యోగం వస్తే కూతుర్ని తీసికెళ్తాడు. అప ఖ్యాతులకు ఆస్కారం వుండదు.

ఉద్యోగం ఏమిటో చెప్పాక నీళ్ళు కారిపోయాడు నమశ్శివాయ.

ఆయన అల్లుళ్ళంతా పెద్ద పెద్ద వుద్యోగాల్లో వున్నారు. కూతుళ్ళు గొప్ప భోగాల్ని అనుభవిస్తున్నారని ఆయన భావన.

"ఐ.ఎ.యస్ సెలక్షనొస్తుందన్న నమ్మకంలేదా? ఒకవేళ అది కాకపోయినా యమ్మెస్సీ పాసవుతే ఏ లెక్చరర్ పోస్టుకో ట్రై చేయొచ్చుగా!"

ఏమని సమాధానం యివ్వగలడు? తన మనోవేదనని ఎలా వివరించగలడు?

"అంతవరకు యిది చేయటంలో తప్పేంలేదుగా?"

చిత్రప్రియను పిలిచేడు. విషయం చెప్పేడు.

"అంతకన్నా గొప్ప వుద్యోగాలేం వస్తాయిటే మనకు?"

"చిత్రా."

"ఎందుకు నాన్నా ఆ అరుపులు? గుమాస్తాకి కట్టేసి మీ బరువు దించుకున్నారుగా! మీ తెలివితేటల్తో చేసిన పెళ్లి. కూతురు సుఖాన్ని కాంక్షించి చేసిన పెళ్లి! మీ కోరిక యిప్పుడు నెరవేరిందిగా సంతోషించండి"

నిలవలేనట్లు లోపలికెళ్ళిపోయింది చిత్రప్రియ. నిజంగానే తన భర్త కేవలం ఓ గుమాస్తా అన్న భావనని ఆమె భరించలేకపోయింది. తండ్రి తనకు ద్రోహం చేసినట్లు కుమిలి పోయింది.

చిన్నప్పట్నుంచి ఆ యింట్లో ఆమె స్పెషల్ స్టేటస్ను కోరుకుంది. అందరికంటే తను వున్నతురాలుగా భావించుకొంది. గుమాస్తా భార్య కావటం తన స్పెషల్ స్టేటస్! ఎత్తయిన శిఖరంనుంచి దొర్లి పడినట్లుంది ఆమె స్థితి.

"చిత్రకు కూడా యీ వుద్యోగం యిష్టంలేదు. పోనీ మరో మంచి వుద్యోగం ప్రయత్నించరాదూ?

వ్యాస్ జవాబు యివ్వలేదు. సన్నగా నవ్వేడు. "నాకు సెలవిప్పించండి" అన్నాడు.

"ఆ కాస్త కార్యం అయిందనిపించి పిల్లను తీసుకుపోతే నా బరువు దిగుతుందోయ్. గవర్నరువైనా గుమస్తావైనా భర్త భర్తేగా! తీసుకెళ్ళు త్వరగా"

అతను మాట్లాడలేదు. చిత్రప్రియ గదివైపు వో మారు చూచి వెళ్ళిపోయాడు.

కాని సమశ్యవాయ అంతటితో వదల్లేదు. వ్యాస్ చూపులో ఆయన కూతురు జీవితాన్ని చదివేడు. భయపడ్డాడు.

మంచో చెడో తనీ పెళ్ళిచేశాడు. అంతకన్నా తను ఏమీ చేయలేని అశక్తుడు అప్పుడూ, యిప్పుడుకూడా! తను చేసిన పెళ్ళి కూతురు కిష్టంలేదు. అయినా ఆనాడు అంగీకరించింది. ఆ తర్వాత తన ప్రవర్తనతో అల్లుడి మనసును విరిచేసింది. కూతురు కాపురం విరిగిన పాలు కాకూడదు. తోడుకోని పెరుగు కారాదు.

అల్లుడికి వుత్తరాలపైన వుత్తరాలు రాసేడు. సమాధానం లేదు.

సూరిశాస్త్రితో మాట్లాడేడు. "పెళ్ళి మీ యిష్ట ప్రకారం చేసు

కొన్నాడా. యీ విషయంలో మా మాట వినటానికి? వందేళ్ళ వాడి జీవితంలో పల్లేరు కాయలు ఎలాగూ గుచ్చుకొన్నాయి. వాడిష్టం. మీ యిష్టం. మధ్యలో మాదేముంది?" అని భర్త బదులు జవాబిచ్చింది కాళికాంబ.

"ఏమిటి డాడీ? నా బరువు దించుకుందామనేనా ఈ తాపత్రయం?"

"కాక బరువు పెంచుకోనా? నాకు చేతకాదు. అయినా ఏమిటి నీ వుద్దేశం? కాపురం చేద్దామని లేదా?"

"ఎందుకులేదు? మహారాజా కిచ్చారుగా? మహారాణి జీవితం నన్ను వెయ్యిచేతులతో ఆహ్వానిస్తుంది. మీరు పరిచిన బంగారు బాటలో గులాబులు గుత్తులు గుత్తులుగా రెక్కలు విప్పుకొని నవ్వుతూ నన్ను పిలుస్తున్నాయి. వెళ్ళొద్దూ?"

చివరికి జవాబొచ్చింది వ్యాస్‌నుంచి.

"నా భార్యను నేను తీసుకెళ్ళటానికి నా కెప్పుడూ అభ్యంతరం లేదు. కాని ఆమె యీ పేద గుమాస్తాతో, బుద్ధిచెంబుగాడితో కాపురం చేయగలదేమో కనుక్కోండి."

చిత్రప్రియను తీసుకొని హైద్రాబాద్ చేరుకొన్నాడు నమశ్శివాయ.

"యిదేనా మన పేలస్?" వేదవ్యాస్ తీసుకెళ్ళిన వో చిన్న యింటిలో కాలు పెడుతూ వేసిన మొదటి ప్రశ్న.

పైకి పొంగలేదు కాని, నమశ్శివాయకు ఆ యిల్లు చూస్తే ఏడుపొచ్చింది. రూపాయల నోట్ల మధ్య పుట్టిన చిత్రప్రియ దరిద్రపు కోరల్లోకి పోతోంది. కారణం ఎవరు?

తనే. కాని తాను చేయగలిగిందేముంది? వేదవ్యాస్ ఆనాడు ఔదార్యాన్ని చూపకపోతే అసలు తాను కూతురుకి పెళ్ళి చేయగలడా?

ఏమో? ఎవరు చెప్పగలరు? అతను చదువుకొన్నాడు. తెలివి వుంది. ఎప్పుడూ యిలాగే వుంటుందా అతని కాలం? భవిష్యత్ అతని కోసం ఏందాచిందో?

ఆ ఆశనే కూతురు మనసులో కూరటానికి ప్రయత్నించాడు వున్న రెండు రోజులూ. కాని చిత్రప్రియ మనసులో రగుల్కొంటున్న

ఏదో అసంతృప్తి మంటగా మారింది. నిప్పుల్ని కక్కింది. తీరని ద్వేషం ఆటంబాంబులా పేలింది.

"నన్నెందుకు పెళ్ళి చేసుకోడానికి ముందుకొచ్చావ్ ఆ నాడు?"

"నిన్నుచూచి. నీ అందానికి పరవశం చెంది-నిన్ను చిన్నప్పటి నుంచి ప్రేమిస్తున్నాను" అని అతను సమాధానం యిచ్చివుంటే ఆమె శాంతించి వుండేదేమో. కాని అతనలా అనలేదు. ఇన్నాళ్ళ ప్రవర్తన అతన్నామాట అననివ్వలేదు.

"నువ్వెందుకు నన్ను చేసుకోటానికి అంగీకరించావ్?" ఎదురుప్రశ్న వేశాడు. అతనికది సమాధానం చిక్కని ప్రశ్న! వేధిస్తున్న సమస్య!

"నీ అందాన్ని చూచీ. నీ హోదాని, తెలివితేటల్ని చూచీ అనుకొంటున్నావుకదూ!"

"అంత అసహ్యించుకొనేదానివి యిక్కడిదాకా ఎందుకొచ్చావ్?"

"పరాయి మొగాడి పక్కన సినిమా హాల్లో పెళ్లాన్ని చూచి కూడా ఎందుకు రమ్మన్నావ్?"

"గతాన్ని మర్చిపోదామని. నువ్వు కూడా మర్చిపోగలవేమోనని...."

"గతాన్ని మర్చిపోవాలా? ఎందుకు? యింత చక్కటి వర్తమాన జీవితాన్ని చూచుకొనా? బంగారు పల్లకీలు భవిష్యత్తులో నన్ను వూరేగించటానికి వస్తాయనా? నిన్ను చేసుకొన్ననాడే అలాంటి ఆశలన్నీ అంతమయ్యాయి. నాకు మిగిలింది గతం మాత్రమే. ఆ గతాన్ని నా మనసులోనుంచి ఎవరూ చెరిపెయ్యలేరు."

"అనుక్షణం కీచులాడుకొంటూ కాపురం చెయ్యటం. చేస్తున్నట్లు నటించటం నాగరికత లక్షణంకాదు మనసులు కలవవనుకొన్నప్పుడు మరోమార్గం ఎందుకు చూచుకోకూడదు?"

"అంటే విడాకులు యిస్తావా?"

"తప్పా?"

"మూడుముళ్ళు గట్టిగా వేశావానాడు. వాటిని తెంచుకోటం అంత సులభంకాదు. మీ కాళ్ళ దగ్గర యింతచోటు యిప్పించండని.

మీ పాదదాపిగా వుండనివ్వండని ప్రాధేయపడ్తాననుకొంటున్నావేమో? పిచ్చిపిచ్చి ఆలోచనలు కట్టిపెట్టు."

అన్ని ఆలోచనలను స్తంభింపచేస్తూనేవుంది చిత్రప్రియ. రోజుకొక్కసారైనా అతన్ని ఏదో నెపంతో మాటల్తో హింసించక మానదు. దినచర్యలో యిదో భాగమయింది ఆమెకు.

కాని వేదవ్యాస్‌కి యీ స్థితి చాలా ఆందోళనకరంగా పరిణమించింది.

చిన్నతనంనుంచి అతను జీవితంమీద ఎన్నెన్నో కోరికలు పెంచుకొన్నాడు. కేవలం ధనం సంపాదించటం అతని ధ్యేయం కాదు. అతనికి తన శక్తి తెల్సు. ఆ శక్తితో దేశానికి వుపయోగపడే లాంటి పనులేమేమో చెయ్యాలన్న తాపత్రయం!

తన భవిష్యత్ జీవిత విధానంపట్ల అతనెన్నో ఆదర్శాల నల్లుకొన్నాడు. సుఖించటం, భోగాల ననుభవించటం ముఖ్యం కాదు. కష్టించి పని చెయ్యటంలో సుఖం చూడాలి.

గుమాస్తా వుద్యోగంలో కూడా రోజంతా ఏవేవో అంకెలతో కుస్తీ పడ్తూనేవుంటా డతను. కాని తను సంపాదించుకొన్న విజ్ఞానాన్ని ఎలా దేశానికి వినియోగించగలడా వుద్యోగంలో? సంకుచితమైన పరిధిలో వుంటూ విశాల దృక్పథాన్ని ఎలా అమలుపరచగలడు?

యూనివర్సిటీ ఫస్టుగా యమ్మెస్సీ పాసయ్యాడు. కాని ఐ. ఏ. యస్. పరీక్ష పోయింది. అది అతను వూహించని సంఘటన పెళ్ళి ద్వారా జీవితంలో మొదటి వోటమిని ఎదుర్కొన్నాడు. యిది రెండో వోటమి. బాధపడ్డాడు.

"అందలం ఎక్కాలన్న ఆశ లందరికీ వుంటాయి. కాని తాహతే వుండదు. నన్నంటే ఎలాగోలాగు పెళ్ళి చేసుకోగలిగేవు. కాని కలెక్టరు కావటం అంత సులభం అనుకోకు."

"చిత్రా!"

"బురదలో మునుగుతూ బురదనే అమృతం అనుకొని రాగే బురద పురుగు పొరపాటున తన దగ్గర పద్మ పుష్పంలోని మధురాన్ని ఆస్వాదించగలదా? పద్మ పుష్పానికి బురద అంటుకోవల్సిందే! పరిమళాన్ని కోల్పోవల్సిందే!"

ఇంట్లో యీ గోల.మనసులో ఐ. ఎ. ఎస్. పోయిందన్న బాధ!

అతను ఐ. ఏ. యస్‌కు మళ్ళీ కట్టేడు. పెద్దపెద్ద వుద్యోగాల కోసం ప్రయత్నించసాగేడు. సాధ్యమైనంతకాలం ఆఫీసులో. ఫ్రెండ్స్ దగ్గర గడపసాగేడు. యింటికొస్తే ఆ కాస్త మనశ్శాంతి వుండదు. సాధింపులు-మనసు చిల్లులు పడేమాటలు!

* * *

"రెండు నెలలయింది ఈ యింట్లోకొచ్చి. పక్కవాళ్ళతో మాట్లాడితే ముత్యాలు నష్టపోతారని భయమా?"

మామూలు అలవాటు ప్రకారం మేడల వైపు. కారుల వైపు. చిలకల వైపు చూస్తూ కలల్లో విహరిస్తున్న చిత్రప్రియ ఆ మాటల నన్న ఆవిడవైపు చూచింది.

గుమాస్తాల గూళ్ళలో ఒకదానిలో వుండే ఆమెను చాలా సార్లు చూచింది చిత్రప్రియ. దాదాపు యిద్దరిదీ ఒకే యీడు. అందంగా వుంటుంది, స్నేహం చేస్తే ఆ పిల్లతో చేయాలని చిత్రప్రియ ఒకటి రెండు సార్లు అనుకొంది కూడా.

"ముత్యాలు పడ్డా. రత్నాలు రాలినా మీ యింట్లోనే కదా అని నేనే వచ్చా. మాట్లాడుతారు కదా!" చాలా చొరవగా, అందంగా అంటూ వచ్చిందామె.

"రండి, రండి...."

కలల్ని చెడగొట్టినందుకు ఆమెపై చిత్రప్రియకు చిరాకు కలగ లేదు. కాగా నవ్వుతూ ఎంతో ఆనందంగా, సర్దాగా కన్పిస్తున్న ఆమెను చూస్తుంటే ప్రాణం లేచొచ్చింది.

"ఎంత అపురూప సౌందర్యవతి అవుతే మటుకు యింటిలోనే ఎంతసేపు కూర్చుంటావమ్మా. నీ సౌందర్యాన్ని ఆడవాళ్ళే అపహరిస్తా రని భయం కామోసు! బయటకే ఎప్పుడూ రావు!"

పుష్పక విమానం ఎక్కినంత సంతోషం; చంద్రమండలంలో సౌధం కట్టుకొన్నంత ఆనందం....!

ఒక అందమైన యువతి తన అందాన్ని ప్రశంసిస్తోంది!

"లేదండీ- ఏమిటో కొత్త....పైగా మీ అంత మంచివారు పక్కనున్నారని తెలిస్తేగా?"

ఆ తర్వాత యిద్దరూ మనసులు విప్పుకొన్నారు. మాటలు రత్నాల రాసులై గుట్టలు గుట్టలుగా పడ్డాయి. రెండు హృదయాలు దగ్గరయ్యాయి.

అయిదు కాగానే శారద లేచింది-"ఆయన వస్తారు ప్రియా" అంటూ.

"ప్రియ! ప్రియ!...."శారద తనభర్త అయినా బాగుండిపోను.

"ఏం వస్తే? కాఫీ యివ్వటమేగా! కాసేపు కూర్చోరాదు శారదా!"

"మీ శ్రీవారు యింటికి రాగానే కాఫీమాత్రమే యిస్తే వూరు కొంటారేమిటి? మళ్ళా రేపొస్తాగా! ఆయన అమిత దుర్మార్గుడు. యింటికి రాగానే నేను కనిపించకపోతే నమిలి మింగేస్తాడు." అంటూ వెళ్ళిపోయింది శారద.

"యింత మంచిపిల్ల అంత దుర్మార్గపు మొగుడితో ఎలా వేగుతోందో పాపం" అనుకొని శారద మీద బోలెడంత జాలిపడింది. ఆ జాలిలోనే ఆమెకు వేదవ్యాస్ గుర్తుకొచ్చాడు.

"పాపం మంచివాడు.తను ఎన్నన్నా ఏమీఅనడు.ఏమీ అడగడు. చెప్పినదల్లా చేస్తాడు పాపం"యిలాంటి ఆలోచన ఆమెకు చాలా రిలీఫ్ నిచ్చింది.

అసలే శారద రావటం ఒంటరితనం నుంచి ఆమెకు విముక్తి కాగా, శారద మాటలు, పద్ధతులు, పొగడ్తలు ఆమెకు అమృతధారలే అయ్యాయి. ఎప్పుడూ లేనంత హుంషారొచ్చింది. ఆ హుంషారులో వేద వ్యాస్ చాలా మంచివాడుగా కన్పించాడు.

"పాపం, అనవసరంగా మాటలని కష్టపెడ్తున్నాను. పెళ్ళి చేసు కోటంలో తప్పేముంది? ఆ స్థితిలో తననసలు ఎవరు చేసుకొంటారు గనుక? అయినా అతనికేం తక్కువ? సూట్ వేసుకుంటే అసలు తనకు మొగుడు కావల్సిన వాడికన్నా. తను తాపత్రయపడ్డ సాగర్ కన్నా ఎంతో అందంగా వుంటాడు! తెలివిగలవాడు. తెలివిగలవాళ్ళకే తెలివి చెప్పగల తెలివి గలవాడు, తనే అనవసరంగా...."

తను మరీ మంచిదానినవుతున్న నన్న స్మరణవొచ్చి ఆలోచ నవి బ్రేక్ చేయటం-మళ్ళీ ఆనందం. ఏదో తృప్తి. వుత్సాహం-మళ్ళీ వ్యాస్ నిగురించి ఆలోచన-తొమ్మిదింటిదాకా అలాగే జరిగి పోయింది.

వస్తూనే చిత్రప్రియ మొహంలో, ప్రవర్తన లో మార్పు కని పెట్టేశాడు వ్యాస్. ఏదో వింత వుత్సాహం! మార్పు!!

"థేంక్స్. నువ్వు నా కోసం యింతసేపు కనిపెట్టుకొని వున్నావు. నేను రావటం ఆలస్య మయింది. కాస్త పనెక్కువగా వుంది. క్షమించు".

మరీ వుత్సాహం వచ్చింది. భర్తపట్ల జాలి కలిగింది.

"పాపం శారద భర్త అమిత దుర్మార్గుడట. ఇంటికి రాగానే భార్య కనిపించకపోతే నమిలి మింగేస్తాడుట" ఎంతో గొప్ప విష యాన్ని కనుక్కొన్నట్లు అంది.

"శారద భర్త దుర్మార్గం ఎంత తియ్యనిదో కూడా తెల్సు కోలేని ఆడది. పిచ్చిపిల్ల చిత్రప్రియ!" అనుకొని జాలిపడ్డాడు. అమా యకత్వానికి నవ్వుకొన్నాడు. "అలాగా పాపం!" అని అన్నాడు పైకి మాత్రం.

"ఆడదాన్ని అలా తిట్టడానికి, హింసించడానికి ఎవరిచ్చారో ఆ అధికారం? పిచ్చిపిల్ల లాగుంది. నేను కలుగచేసుకుని ఆ పిల్ల కాపురం చక్కబెట్టాలి."

ఆ పూట హాయిగా నిద్దర పోయారిద్దరూ. మనస్తాపాలు మర్చి పోయారు.

మర్నాడు పదకొండు గంటలకే వచ్చింది శారద.

"అవును. మీ వారు రాగానే కాఫీ యిస్తే వూరుకోరన్నావు. మరేమిస్తావేం?"

చిత్రంగా చూచింది శారద చిత్రప్రియ వైపు. మొహంలో అమాయకత్వం!

"అయితే నువ్వేమీ యివ్వవన్న మాట!"

"నేను కాఫీనే యివ్వను ఆ మాటకొస్తే...." అంటూ తన కథను చాలా గొప్పగా చెప్పుకొంది చిత్రప్రియ. ఆఖరికంది "ఆడ దాన్ని మొగాడు బానిసలా చూడటం నేను సహించను."

శారద నవ్వింది.

"ఏమిటి నవ్వుతున్నావ్?"

"నేను రాగానే ఏమిస్తానో చెప్పనా?"

"చెప్పు. అవసరమైతే నీ కోసం....నీ హక్కు కోసం...."

"పిచ్చి ప్రియా. నా భర్తకు నేనిచ్చే దేమిటో తెల్సా? యిది" అంటూ చిత్రప్రియ బుగ్గల్ని గట్టిగా ముద్దుపెట్టుకుంది శారద.

"ఏమిటి?"

మళ్ళీ ముద్దుపెట్టుకొని. "ఆఫీసు నుంచి రాగానే యిది యివ్వక పోతే వూరుకోరు మా వారు."

"ఛీ-పో" బుగ్గల్ని మెత్తగా వేళ్ళతో నిమురుకొంటూ పరవశించిపోతూ అంది చిత్రప్రియ.

"ఆయన వచ్చేసరికి నేనింట్లో కన్పించక పోతే ఏం చేస్తారో తెలుసా?"

"నమిలి మింగేస్తారని చెప్పావుగా...."

"అవును. యిలా పట్టుకుని....యిలా నమిలి...."

శారద కౌగిటిలో చిత్రప్రియ ఉక్కిరిబిక్కిరయింది. ఏదో మధురానుభూతి!

"యిప్పుడు చెప్పు! నా హక్కులకోసం నా కోసం నా భర్తతో పోట్లాడుతావా?"

చిత్రప్రియ మనసులో ఏవో మధుర ఆలోచనలు. శారద స్థానంలో వేదవ్యాస్.

"ఆయన యింటిలో లేని ఆ కొన్ని గంటలు నాకు పిచ్చెక్కినట్లుంటుంది. అందుకే ఆ యిల్లూ. ఈ యిల్లూ కబుర్లు చెపుతూ తిరుగుతాను. నీ లాంటి అందమైన ఆడదంటే. పిచ్చిపిల్లలంటే నాకు మరీ ప్రేమ."

శారద భర్తను గురించి. తమ పెళ్ళిని గురించి చెప్పమనకుండానే చెప్పేసింది.

అతని పేరు మోహనరావు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టేడు. డబ్బులేకపోయినా వంశ గౌరవం ఎంతో వున్నవాడు. శారదను

చదువుతున్న రోజుల్లోనే ప్రేమించాడు. ఆమె కోసం తిరిగేడు. వుత్తరాలు రాసేడు. శారదకూడా అతన్ని ప్రేమించింది.

తీరా మనసులు విప్పుకొన్నాక కులాలు పెళ్ళికడ్డం వచ్చాయి. అతని తల్లి దండ్రులు తమ కులం కాని తక్కువ కులంలో పుట్టిన శారదను అంగీకరించ లేదు. అందర్నీ కాదని ఆమెని చేసుకొన్నాడు. ఆమెతో పాటు ఆమె ప్రేమకు, ఆమె తెచ్చిన కొద్దిపాటి ఆస్తికి, హక్కుదారుడయ్యాడు.

"ఆయనకి నేనంటే ఎంత యిష్టమో! నా కోసం ఆయన గొప్ప త్యాగం చేశాడు. కులాన్ని, తల్లిదండ్రుల్ని వదులుకొన్నాడు."

శారద వెళ్ళాక చిత్రప్రియ వాళ్ళ యింటి వైపే చూస్తూ కూర్చున్నది. ఆమెకు మోహనరావుని చూడాలనివుంది. భార్యను అంత సుఖపెట్టే మోహనరావు! భార్యకోసం కులాన్ని, తలిదండ్రుల్ని వదులుకున్న మోహనరావు! యింటికి రాగానే భార్య ముద్దులు తాగేసి, భార్యనే తినేసే.... అతను ఎంత అందగాడో! ఎంత సరసుడో!

ఆరయింది. ఏడయింది. శారద యింటివైపు ఎవరూ వచ్చిన జాడలేదు.

భర్త ఆఫీసు వదలగానే వస్తాడందే శారద. ఎనిమిదయింది.

చిత్రప్రియ యింటి తలుపేసింది. ఎందుకు రాలేదు పాపం. కనుక్కురావాలి. వొకవేళ వచ్చాదేమో! తనుచూడలేదేమో!.... వస్తే ఏకంగా లోపలికేపోయే అతన్ని చూచి రావచ్చు. వాళ్ళ అందమైన జీవితాన్ని వొక్కక్షణమైనా....

వాళ్ళ యింటి దగ్గరికెళ్ళేసరికి సైకిల్‌మీద ఎవరో దిగేరు. సైకిల్ని యింట్లోకి తీసుకెళ్తున్నాడు. వాకిట్లో లైటు వెలిగింది.

లైటు వెలుగులో మోహనరావు....ఆ వ్యక్తి-అసలు మోహన రావేనా?- కన్పిస్తున్నాడు.

అదేమిటి? అందగాడనుకొంది తను! శారద యితన్ని గురించా అంతగొప్పగా చెప్పుకొంది?

నల్లగా, సన్నగా వున్నాడు. సగం బట్టబుర్ర. వొక పన్ను పెదిమిపైకి నిక్కబొడుచుకొచ్చింది. కళ్ళకాస్త మెల్ల, తోటకూరలా.. ఎండిన చేపలా....ఛీ. ఛీ....

సైకిల్తోపాటు మోహనరావు లోపలికెళ్ళేడు. తలుపులు మూసుకొన్నాయి. లైట్లు ఆరిపోయాయి.

శారద మాటలు గుర్తుకొచ్చి చిత్రప్రియ సిగ్గుపడింది.

అతను అందవిహీనుడే కావచ్చు! కాని రసికుడు, సరసుడు. భార్యను దేవతగా, ప్రేమదేవతగా ఆరాధించేవాడు కావచ్చుగా! యీ ఆలోచనతో పులకించింది.

ఏం చేస్తాడో, ఏం మాట్లాడుకొంటారో చూడాలన్న వెర్రి కోరిక చిత్రప్రియలో ప్రవేశించింది. ఆమె యింటికి బాగా దగ్గరి కెళ్ళింది. కిటికీలో ఓ రెక్క అదృష్టవశాత్తు తెరచేవుంది.

అందులోనుంచి చిత్రప్రియ చూసిన దృశ్యం....జీవితంలో మర్చిపోలేనిది!

శారద జుట్టు అతని చేతులోవుంది. కాలు- కిందపడ్డ ఆమెను తంతోంది.

"రాగానే 'తాగేవా' అంటూ ఏడవ్వొద్దని ఎన్నిసార్లు చెప్పేనే! నేను తాగుతాను, రేసులు ఆడతాను. మెహిందీలో ముండల్తో పడుకొంటాను, నువ్వెవతెవే నన్ను నిలిపేదానికి? పాపిష్టి మొహం వేసుకొని రాగానే నాకు ఎదురు పడొద్దని చెప్పానా!"

గట్టిగా కళ్ళు నులుముకొని మళ్ళీ చూచింది చిత్రప్రియ. అదే దృశ్యం! శారద అందమైన కళ్ళల్లో కాలువలు!!

"యివాళ నా పుట్టిన రోజు. యివాళైనా అయిదున్నరకు—"

"ఏం పుట్టే? నువ్వు పుట్టి ఎవర్ని వుద్ధరించావ్! అయిదింటి కొచ్చి నీ ముందు కూర్చొని నీ సంగీతం వింటాననుకొన్నావా? నిన్ను కుక్కపిల్లలా వెంటేసుకొని వూరంతా తిప్పుతానను కొన్నావా?"

చేతితో తోసి కాలితో మళ్ళీ పెడేలున తన్నేడు, శారద అల్లంత దూరంగాపోయి పడింది, అక్కడ దేన్ని కొట్టుకొందో తల నుంచి రక్తం కారుతోంది.

యిక చూడలేకపోయింది చిత్రప్రియ. ఒకవైపు కోపం, ఆవేశం, మరోవైపు బాధ, భయం—

పరుగెత్తుకుంటూ యింటి కొచ్చింది. వాకిట్లో వేదవ్యాస్! అతని చేతుల్లో వాలిపోయింది, అతనామెను పువ్వులా పొదివిపట్టు

కొన్నాడు. ఆ స్పర్శలో ఎంతహాయి! ఆ రెండు బాహువుల మధ్య ఎంతటి ధైర్యం! నిశ్చింత!!

వేదవ్యాస్ తలుపు తీశాడు. ఆమెను నెమ్మదిగా తన భుజాల మోపుమీద మంచం దగ్గరకి తీసుకొచ్చి పడుకోబెట్టేడు. చిత్రప్రియకు ఆ భుజాలమీద అలాగే వాలి వుండా లనిపించింది. ఆమె అతని చెయ్యి వదల్లేదు. అతను ఆమె చేతిలో తన చేతినివుంచి, మరోచేత్తో, తన చేతితో, కలిపిపోయిన ఆమె రెండు హస్తాలను మృదువుగా నిమర సాగేడు.

"ఏమయింది? ఎందుకంత భయపడ్డావ్?"

"శారద....శారద అన్నీ అబద్ధాలు చెప్పింది. ఆమె భర్త.... ఆమె భర్త నిజంగా దుర్మార్గుడు—"

"భార్యను కొడ్తున్నాడా?"

"నీకెలా తెల్సు?"

"చాతకాని మగాళ్ళు చాలామంది చేసే పనే అది. తమ ఘన తకు చిహ్నం అనుకొంటారు."

"నువ్వెందుకు నన్ను కొట్టవ్?"

"ప్రేమ దేవతని పూజిస్తారు; కొట్టుకోరు. అవి మనుష్యులు చేసే పని కాదు."

"వ్యాస్! నువ్వెంత మంచివాడివి—"

"నీకన్నానా!"

"అనవసరంగా నిన్ను అనరాని మాటలన్నాను కదూ! అవమానించాను కదూ; బాధ పెట్టేను కదూ!"

"ఏం లేదు. అదంతా మర్చిపో. అసలే అలసిపొయ్యావు; అన్నం తిని పడుకో"

అన్నం అతనే పెట్టేడు. అతను ఎదురుగ్గా కూర్చొని కొసరి కొసరి అన్నం తినిపిస్తుంటే ఏదో మధురానుభూతి!

అన్నం తిన్నాక మళ్ళీ పక్కదగ్గరికి తీసుకెళ్ళాడు. కావాలనే అతని భుజాలమీద మరింతగా వాలింది.

"పడుకో చిత్రా! నిద్రపోతే ఆ భయంకర దృశ్యాన్ని మర్చి పోతావు."

"నువ్వు నన్ను వదిలిపోవు కదూ!"

"పోను చిత్రా—"

"చిత్రా కాదు ప్రియా—"

"ప్రియా"

అంతలోనే ఆమెకో గమ్మత్తైన ఆలోచన వచ్చింది. నిముషంలో నిద్ర పట్టేసినట్లు నటించింది.

నిద్రపోయిందన్న నమ్మకం కుదిరాక అతను లేచాడు-చాలా నెమ్మదిగా, సుతిమెత్తగా—తనకు నిద్రాభంగమవుతుందేమోనన్న భయంతో ఆమె మెడదాకా దుప్పటి కప్పేడు. అలాగే ఆమె మొహం లోకి అయిదు నిమిషాలు చూస్తూ నిలబడ్డాడు.

మూసీ మూయనట్టున్న ఆమె కళ్ళల్లోకి అతని చూపులొచ్చి గుచ్చుకొన్నాయి.

అతను లేచి వెళ్ళి లైట్లు ఆర్పి చప్పుడు చేయకుండా పడు కున్నాడు.

చిత్రప్రియ కళ్ళు తెర్చింది.

యిన్నాళ్ళుగా అతని బెడ్డుకీ-ఆమె బెడ్డుకీ, ఎనిమిదడుగుల దూరం!

అతను నిద్రపోయాడనుకొన్నాక ఆమె లేచింది. లైటు వేసింది. అద్దంలో మొహం చూచుకొంది. చిత్రం! అది తన మొహం కాదు, శారదది. ఏడుస్తోంది.

భర్త వైపు చూచింది. శారద భర్త మోహనరావు రూపాన్ని అతనిలో చూడటానికే భయమేసింది. అందానికి అందం. ఔదార్యా నికి ఔదార్యం అన్నీ వున్నవాడు తన భర్త. తను తిరస్కరిస్తోంది. —ఏమీ లేదు. అన్నీ అపనవ్యాలే. అయినా భర్తకోసం తపిస్తోంది— తన్నులు తింటోంది శారద!

"ఛీ ఛీ.... ఎంత పొరపాటు!"

చిత్రప్రియ మొహం కడుక్కొని చీరె మార్చుకొని వచ్చింది. స్నో రాసుకొని పౌడరు అద్దుకొంది. కంటికి కాటుక దిద్దుకొంటూ అద్దంలోకి చూచింది. కంటిపాపలు ఆమె అందాన్ని చూడలేక సిగ్గుతో కళ్ళు మూసుకోబోయాయి.

లైటు ఆర్పింది. బెడ్ లైట్ నీలికాంతిని వెదజల్లుతోంది.

వేదవ్యాస్ మొహంలోకి తొంగి చూచింది. చూచేకొద్దీ చూడా లనిపించింది. ఏదో....ఏదో....మధురావేశం....

మంచం మీద అతని ప్రక్కన పడుకొంది మెల్లగా.

"ప్రియా...."

"అమ్మదొంగా! మేల్కొనే...."

ఆమె పెదవులు మూత పడ్డాయి. బుగ్గలు ఎర్రబడ్డాయి, మనసు చల్లబడింది. శరీరమంతా పన్నీటిలో స్నానం చేసింది.

* * *

మర్నాడు నిద్ర లేచేసరికి వొళ్ళంతా మత్తుగా వుంది. మన సంతా తేలిగ్గా వుంది.

"పోనీ యివాళ ఆఫీసుకు పోకపోతేనేం?"

"అవును. ఏం? మానేస్తాను."

"సిగ్గులేదూ? ఆఫీసు మానేసి నా ఎదుట కూర్చుంటావా?"

"ఏం తప్పా?"

"యిన్నాళ్ళు ఎక్కడికిపోయాయో యీ మాటలు?"

"అమ్మగారిని చూచి భయపడి మూగపోయాయి."

"సరేగాని ఆఫీసుకెళ్ళి – సాయంత్రం త్వరగా రా."

"దేవిగారి ఆజ్ఞ."

శారద మామూలు టైంకే వచ్చింది. ఎప్పటిలాగా నవ్వుతూనే వుంది. వస్తూనే చిత్రప్రియ మొహంలో తేటతనాన్ని కనిపెట్టే సింది.

"మొహంలో పెళ్ళికూతురి కళ వచ్చింది. ఏమిటో విశేషం? మా అన్నయ్యగారు నమిలి మింగేయలేదుకదా విన్ను?"

చిత్రప్రియకు ఏం సమాధానమియ్యాలో. ఆ ఆడదానితో ఎలా మాట్లాడాలో తోచలేదు.

"తల కా కట్టు ఏమిటి?"

"యిదా? రాత్రి పంపు దగ్గర జారిపడ్డాను. సమయానికి పక్కన ఆయన వుండి ఆసరాగా అదుకోబట్టి సరిపోయింది కాని లేకపోతే తల పగిలే మాట!"

శారద మనస్తత్వం బోధపడలేదు చిత్రప్రియకు! అది ప్రేమా? త్యాగమా? నిజమా? నటనా? మంచా? చెడా?....ప్రశ్నలు.... ప్రశ్నలు!!!

అయినా వీటన్నిటినీ వూదిపారేసింది ఆవేశం. రాత్రి కళ్ళతో చూచిన సంఘటన కాదనలేని సత్యం

"శారదా! మన పరిచయం చాలా తక్కువ. అయినా ఎందుకో యిద్దరం చాలా దగ్గరయ్యాం. నీ సంగతేమో నాకు తెలియదు. కాని నేను యింతకు పూర్వం ఎవరికీ అంత దగ్గర కాలేదు. లేకపోతే నన్నెవరూ అంత దగ్గరకి తీసుకోలేదు. చివరికి కన్న తల్లిదండ్రులు, అన్నలు, అక్కలు కూడా! అందుకే నిన్నొక విషయం అడుగుతాను. నిజం చెప్తావా?"

"ఆయనకి కాఫీ తర్వాత యివ్వాల్సినదాన్ని గురించేనా? అడుగు."

ఒక్క క్షణం నిశ్శబ్దం. చిత్రప్రియ ధైర్యాన్ని, సాహసాన్ని సమీకరించుకొంటోంది. శారద చాలా సర్దాగా వుంది.

"నువ్వు నాతో ఎందుకనంత ఘోరమైన అబద్ధాన్ని చెప్పావ్? ఎందుకు నన్నంత దారుణంగా మోసం చేశావ్?" నెమ్మదిగానే అడిగినా సూటిగా వున్నాయా ప్రశ్నలు.

శారద తల వంచుకొని వున్నదల్లా తలఎత్తి చిత్రప్రియ వైపు చూడలేనట్లు చూచింది. అంతవరకు ఆనందంగా ఆడుకొంటూ మిలమిల లాడుతున్న ఆమె కళ్ళల్లో దీనత్వం, వేదన!

"అబద్ధాలు చెప్పటం, ఎదుటి వాడిచేత వాటిని నమ్మింపచేయటం నాకు అలవాటు ప్రియా. యిలా మనుష్యుల్ని మోసం చేయటం నాకు సర్దా, అయినా నేను నా కథను నిజమే చెప్తే నువ్వు నమ్ముతావా? స్నేహం చేస్తావా?"

"అందుకని—"

"యింట్లో ఎలాగూ తప్పదు ప్రియా ఏడుపు. వాకిట్లో కొచ్చి కూడా నా కన్నీళ్ళ నెందుకు ఖర్చుచేసుకోవాలి? నీ కన్నీళ్ళ కోసం నేనెందుకు తాపత్రయపడాలి? అసత్యం, మోసంతో నిండి వున్న లోకంలో నేను నా గురించి అబద్ధం చెప్పుకొని

వో చిన్న మోసంచేసి సర్దా అనుభవిస్తే ఎవరికేం నష్టం? ఆ మాత్రం ఆనందానిక్కూడా నాకు అర్హత లేదంటావా?"

"కాని....?"

"నీ విషయాల్లో నేను పొరపాటు పడ్డాను. నా కథవిని నా మొగుడిని, నన్ను, మా సర్దాలను దొంగచాటుగా చూట్టానికి వుబలాట పడ్తావనుకోలేదు. యింతవరకు ఎవరూ అంత శ్రమ తీసుకోలేదు. ఎలాగోలాగు నాకథ తెల్సుకొన్నాకకూడా యింత బాధపడి నన్ను విలేయలేదు. చెవులు కొరుక్కున్నారు. భర్తచేత తిరస్కరింపబడ్డ స్త్రీకి విలువేముంది చెప్పు! అందులోనూ తోటి ఆడదానికి మరీ చులకన. నాతో స్నేహాన్ని మానుకొన్నారు. నా కథ నేను చెప్పినంతవరకే చాలామందికి తెల్సు. అందుకే అందరి దృష్టిలో నా భర్త చాలా గొప్పవాడు. నేనే చేయరాని పనులేవో చేసి అంత మంచివాడిని బాధపెట్టి తన్నులు తింటున్నాను. అతని సుఖాన్ని కాల్చేస్తున్నాను."

"నేను నమ్మను. అది అబద్ధం అని అరచి చెప్తాను"

"అయితే చాలాకథ తెల్సునన్నమాట! చాలావరకు సినిమాను రాత్రి చూచావన్న మాట!"

"నీకు యింకా తమాషాగా వుందే?"

"అయిదేళ్ళ వైవాహిక జీవితం తర్వాత, రోజూ ఆ పద్ధతి బతుక్కు అలవాటు పడ్డాక యివాళ ఆ కాస్త తమాషాను వొదులుకొని, సీరియస్ ఎందుక్కావాలో నాకు తెలీదు."

"కాదు. నీ జీవితంలోని వాస్తవం. నా జీవితంలోని వాస్తవాన్ని చూచేటట్లు చేసింది. నా బతుకులో- విన్నటి నీ నరకతుల్యమైన రాత్రి మధురమైన మైలురాయి- వెన్నెలరాత్రి. అందుకే నీ నిజకథ నాకు చెప్పితీరాలి. నీ జీవితాన్ని నేను మార్చితీరాలి"

శారద చిత్రప్రియను కౌగిలించుకొంది. నలిపేసింది. ముద్దులతో ముంచేసింది.

"యింత మాత్రం నాపట్ల అభిమానాన్ని చూపిన వాళ్ళెవరే ప్రియా! నా జీవితాన్ని నేను మార్చుకోటానికి ప్రయత్నించలేదనుకోకు. నేనూ చదువుకున్నాను. కాలేజీలో వివిధ కార్యక్రమాల్లో పాల్గొన్నాను. జీవితంపైన-ముఖ్యంగా స్త్రీల సమస్యలపట్ల, నిర్దిష్టమైన అభిప్రాయా

లున్నాయి. అయినా నా జీవితాన్ని సుఖవంతం చేసుకోటం నాకు చాతకాకపోయింది. ప్రియా! ఎంత ప్రయత్నించీ ఓటమినే ఎదుర్కొన్నాను. నువ్వు మారుస్తానన్నావు. నా మీద నాకు నమ్మకం జాస్తి. ఆ నమ్మకమే పోయింది యీ విషయంలో. యిక నీ మాటల మీద ఆశల్ని ఎలా పెంచుకోను? నిజకథ అడిగావుకదూ! విను. కాని ముందు నాకో మాటివ్వాలి".

"ఏమిటి?"

"యీ నిజకథ ఎవరికీ చెప్పకూడదు. నా భర్తపట్ల జనంలో వున్న సానుభూతి పోగొట్టకు. నన్నందరూ అలాగే అసహ్యించుకోనీయి. నన్నలాగే కొత్తపరిచయాలని చేసుకొంటూ, చేసుకొన్న పరిచయాలని, స్నేహాల్ని నాలుగురోజుల కోమారు పోగొట్టుకొంటూ బతకనియ్యి."

"నీ యిష్టం"

"కథంటే కాగితాలు కాగితాలు రాద్దామను కొంటున్నావేమో. అసలు కథ చాలా సింపుల్. నీకు నేను చెప్పిన అబద్ధం కథకు పూర్తి పూర్తివ్యతిరేకం"

"అంటే....?"

"అర్ధంకాలేదూ? ఆయన పుట్టింది చాలా తక్కువ కులంలో. నేను బ్రాహ్మణుల పిల్లను."

"నిజం!"

"ఆయన కాలేజీలో నాచుట్టూ తిరగలేదు. కాలేజీ వదిలేసి ఆయనచుట్టూ నేను తిరిగేను. ప్రేమభిక్ష పెట్టమని ప్రార్థించాను. డబ్బున్న నా వాళ్ళని, నా కులాన్ని, సర్వస్వాన్ని వదిలేసుకొని ఆయన్ని కోరికోరి చేసుకొన్నాను"

"నమ్మను - నమ్మలేను"

"నీ ఖర్మ"

"కాని ఏం కరువొచ్చింది? మంచి సంబంధాలు రాలేదా? కాలేజీలో యింతకన్నా అందమైన వాళ్ళే....'

"ప్రియా!" శారద ప్రియ మొహంలోకి చూచింది. నవ్వింది.

"యిలా ఎగతాళిచేస్తారనే నా నిజకథ నెవరికీ చెప్పనే. నువ్వు

నన్నేమన్నా యినా అను, ఆనందంగా మింగేస్తాను. కాని ఆయన్నేమీ అనకు. ఆయన అందాన్ని నా ఎదుటే అవహేళన చేయకు"

"కానీ....కానీ...."

"నా కళ్ళతో చూడవే ఆయన్ని. ఎంత అందగాడనుకోక పోతే ఎంత ఉన్నతుడనుకోకపోతే అన్నాళ్ళు పిచ్చికుక్కలా ఆయన వెంట తిరిగేననుకొన్నావు?"

# 25

అయిదయింది.

చిత్రప్రియ శారద వెళ్ళగానే లేచి ముస్తాబయింది.

వేదవ్యాస్‌ను మోహనరావుతో పదే పదే పోల్చుకోసాగింది. పోల్చుకొనే కొద్దీ వేదవ్యాస్ ఎదిగిపోసాగాడు ఆమె దృష్టిలో.

తనని శారదతో పోల్చుకోవా లనిపించలేదు చిత్రప్రియకు. అది అసహ్యకరమైన భావనగా కనిపించింది.

మూడు నెలలుగా-మూడేళ్ళుగా- పదమూడేళ్ళగా దాగివున్న ప్రేమ- దాచి పెట్టుకొన్న ప్రేమ, ఆ మూడు రోజుల్లో ఖర్చు చేసింది చిత్రప్రియ.

తిరగని చోటులేదు. శెలవు పెట్టించింది. అతనితో తిరిగింది. అతన్ని తిప్పింది. తన సర్వస్వాన్ని బంగారు పళ్ళెంలో పెట్టి అతని ముందుంచింది.

మూడో రాత్రి అలసి సొలసి ఆమె కౌగిట్లో అలుపు తీర్చు కుంటున్న వేళ అతనన్నాడు-"యిన్నాళ్ళు యీ ప్రేమనెక్కడ దాచే వావు ప్రియా? ఎందుకు దాచావు?"

"ఎక్కడా? యిక్కడ" అంటూ అతన్ని గుండెలకు మరీ దగ్గరగా లాక్కుంది.

"ఎందుకా? యిందుకు?"- అతన్ని పెనవేసుకు పోయింది.

"నేనదృష్టవంతుడిని ప్రియా! నీ ప్రేమను పొందిన నేను అదృష్టవంతుడిని"

ఆమెలో ఐక్యమైపోయాడు వేదవ్యాస్!

* * *

"యింక నేనో అడుగుకూడా నడవలేను బాబూ! కాళ్ళు నొప్పులు పుడుతున్నాయి." అంటూ రిసిప్షన్ హాల్లో సోఫాలో కూల బడిపోయింది చిత్రప్రియ.

"నువ్వింక నడవక్కర్లేదు ప్రియా. నడవలేవనే టాక్సీలో పోదామంటే విన్నావు కావు. నువ్వు కూర్చొనుండు. టిక్కెట్టు తీసుకొచ్చి డైనింగ్ హాలుకి ఎత్తుకు తీసికెళ్తాను. భోంచేసి టాక్సీలో యింటికెళ్దాం."

ఎంత ప్రేమ! నిజమే! అతను టాక్సీలో పోదామన్నాడు. డైనింగ్ హాలుకి ఎత్తుకు తీసుకెళ్తానట్ట భర్త అలా అనటం ఎంత అదృష్టం. పాపం ఆ అదృష్టం శారదకు లేదుకదా!!

మిగతా

"పొగమేడలు"

రెండవ భాగంలో చదవండి.

'విజయ'

జూలై నెల

నవలానుబంధం

పొగమేడలు

(రెండవ భాగం)

రచన: కప్పగంతుల మల్లికార్జునరావు



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M127 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 82,83 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Hasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |